# శ్రీ తూము నృసింహదాసు చరిత్ర

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

శ్రీమదఖండమహీమండలమండనాయమానంబగు
భద్రాచలంబున నెలకొన్న శ్రీమద్భద్రాద్రిరామునికరుణఁబడసిన
పరమభాగవతశిఖామణియగు

# శ్రీమహానృసింహదాసుచరిత్రము,

ఇది - శ్రీహరిభజనసింగరిదాసునిచే రచియింపఁబడిన
[illegible]తోడ - అచ్చటచ్చట
నృసింహదాసుగారిచే రచియింపబడిన కీర్తనలును ఆయాకీర్తనలకుముందు సందర్భానుసారముగా వచనంబులును, వెనుక
రామస్తుతిప్రతిపాదకంబులగు పద్యంబులును శ్లోకంబులును
చేర్పఁబడె.

పండితులచేతను బరిష్కరింపఁబడి,

## వంకాయల - కృష్ణస్వామిశెట్టివారిచే

స్వకీయ,
శ్రీరంగవిలాసముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపట్టణము,
౧౮౮౮॥ సం.



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః-

గూము.. నృసింహదాసుచరిత్రము-

శ్రీవిష్ణుస్తుతి.

ఉ॥ శ్రీరమణీకుచద్వితయసిక్తపటీరసుగంధబంధురో। దారశరణ్యుఁడయ్యు నిరతంబును రంబునపద్రమాంగనల్। గూరిచినంతనిల్లిపులుఁగుగున్నఅస్త్రైత నైక్రియామున్॥ శౌరిభజింతుఁబచ్చరంగసారసయుగ్మమునాశ్రయించుచున్॥

ఈశ్వరస్తుతి.

శా॥ శ్రీవిశ్వంకజగద్భయూఖ్యావిపిజుత్సేవింపఁ శ్రీగౌరితో। వామాంకంబునను ఘ్రుజూపన్ బ్రబుషుతోఁ బాలింటఁగాఫుఁడుగా। వేమారుంజనుయావన ప్రపఞ్చుఁడో వేదాంతసంవేద్యగో। స్వామిన్యావహముగాఁగఁగ్రైకొనినసాశంభున్మదిన్గొల్చెదన్॥

బ్రహ్మస్తుతి.

ఉ॥ ఎంచఁగనంచితోన్నతివహించినృజించె ప్రపంచమంచుగీ। ర్తించుజగంబు గాంచుచును దివ్యపమంపుచునెమ్మొగంబువా। క్రుంచలనేత్రికిన్నిలువఁగా సదసంబునరించియుంచ పైనంచితలీలనుండెఘనవాణిని బ్రోచువిధాతగొల్చెదన్॥

విఘ్నేశ్వరస్తుతి.

క॥ గణనాథునిసర్వామరగణనాథునినిఖిలమౌనిగణనీయయశో। గణనాథునిసేవించెదగణనాధికభక్తిజాలుగడలుకొనంగన్॥ నాటకరాగము- ఏకతాళము. వందనమిదే-ఓగణనాథానీకు। వందనమిదే॥ వందనమిదెయరవిందంబులకన్న నందంబగుమీసుందరాంఘ్రులకు॥వందన॥ ఇందుధరునిసతిముందరధిమిధిమిచిందులుద్రొక్కు-మీ-చిన్నపాదములకు॥వందన॥ అనిశముఁజతురాననుఁడాటిగసద్వినుతిసేయుపదవనజంబులకును॥వం॥ అకలంకపగడశ్రీహరిదాసునిమదిచక్కగనిల్పుమీచరణంబులకును॥ వందనమిదే॥ ఓగణనాధా॥ అష్టదిక్పాలకస్తుతి. ఉ॥ ఇంద్రునివహ్నితోఁ గవనుజేంద్రుదయాన్వితకీర్తిసాంద్రుని। స్తంద్రను క్షేంద్రభక్తిపరతంత్రమనఃకుముదాళిపూర్ణిమా। చంద్రుగిరీంద్రబృందపరస్సార

తమఃప్రతిభాదినేంద్రులో । కేంద్రునుతింతుసంతతమభీష్టఫలాప్తికిసమ్మతంబు
నన్ ॥ఉ॥అధ్వరభాగభోక్తలగుసట్టిమహామరకోటికెప్పుడున్ । సాధ్వసకంప
తోఁగొనియొసంగెడుదేవునిసర్వవైరులన్ । సాధ్వసమందఁజేయుబలసారముఁగ
ల్గినగట్టిదిట్టభూ । మధ్వజుగొల్తునెప్పుడుసమంజసమైనమనోంబుజంబునన్ ॥ శా॥
ధర్మాధర్మవివేచనాభిరతిసద్ధర్మంబుఁగావించిన । శర్మాంహస్ఫుటకర్మనిష్ఠులకు
సౌఖ్యాసౌఖ్యముల్గూర్చుచున్ । బేర్మిం జెందినమేటిదక్షిణదిశాధీశోత్తముండైనట్టి
యా । ధర్ముం గొల్చెదనిష్టసౌఖ్యకలనాధర్ముండనై వేడుకన్ ॥ఉ॥పుణ్యజనాన్వవా
యమునబుట్టియుఁబుణ్యజనావనక్రియా । గణ్యగుణాభిరాముఁడై గాంచెనుబుణ్య
జనేశ్వరత్వమే । పుణ్యుఁడతండుమారొసగుఘోరదయామతిశౌర్యకార్యకా । రు
ణ్యమయోవిశాలశుభమాధురులుఁ వేడుకలుల్లసిల్లఁగన్ ॥ శా॥ అంభోరాశిగభీరుఁడై
భువనభవ్యానేకసాద్గుణ్యుఁడై । శుంభద్వైభవుఁడైమహాదయునై శోభిల్లి
లోకంబునం । దంభోనాయకుఁడైనయప్పరుణునేనశ్రాంతమున్ గొల్తును । స్తంభ
ప్రక్రియభక్తియుక్తిరచనారంభుండనై వేడుకన్ ॥ఉ॥ ప్రాణులలోఁదగంగసమ
భావమునన్ బ్రచరించిలోకసం । త్రాణపరాయణుండగుచుదత్పరతన్ హితవృ
త్తితోజగ । త్ప్రాణుడసంగనొప్పువిభుసన్నుతునిన్ బవమానుసంతతా । క్షీణద
యాసుధావృష్టిఁజెచ్చిభజింతుశాంతభక్తితోన్ ॥మ॥ అరవిందాసనవాసవా
దులకుజేయంజాలనెయిందుశే । ఖరుతోసఖ్యమునాకుగాకయునుచున్ గౌతుకా
హలాయత్తహృ । త్సరసీజుండయిపెంపునం జెలగుయక్షస్వామి సేవింతుభా ।
స్వరకాంతస్వరమాత్సరత్వచయసంచత్పుష్పకారూఢునిన్ ॥సు॥ పరిపూర్ణత్వ
ముగల్గిదేవుడగుచున్ భాసిల్లిదిక్పాలక । స్ఫురణన్ జెందిగణాదిమానులునిలిం
పుల్ గొల్వగానందికే । శ్వరుసైనెకిరజగంబులన్నునుచున్ శాసున్నదిన్ గొల్తునే ।
కరుణాధారసుధారసాంబునిధిభక్తానీకసత్సేవధిన్ ॥ శ్రీరామస్తుతి. చ॥ ఘ
నుడగురామచంద్రుపదకంజము లేమదినిల్పి వేడుకన్ । జనకజబూజచేసినుదిజా
రుతరంబువనాంజనేయునిన్ । వినయముచేనుతించిపరవీరభయంకరుఁడైనలక్ష్మ
ణున్ । బ్రణుతియొనర్చియెల్లపుడుప్రార్థనచేసెదనిష్టసిద్ధికిన్ ॥

నాటరాగము - ఝంపెతాళము.

జయజానకీరమణ - జయవిభీషణశరణ- జయసరోరుహచరణ - జ
యదీనతరణా ॥హా॥ జయలోకశరణ్య-జయభక్తకారుణ్య- జయగణ్యలావణ్య-
జయజగద్గణ్యా ॥హా॥ సకలలోకావాస-సాకేతపురవాస-అకలంకనిజదాస- అ
బ్జముఖహాసా ॥హా॥ శుకమునివినుతపాత్ర-శుభపవనజచారిత్ర-మకరకుండలవర్ణ-

మేఘసముదీర్ణా॥హా॥కమనీయకోటీర-కౌస్తుభాలంకార-కమలాక్షరఘువీర-కో
మలావిహారా॥హా॥సమదరిపుజయధీర-సకలగుణగంభీర-అమలహృత్సంచార
అఖిలార్తిహారా॥హా॥రూపనిందితమార-రుచిరసద్గుణసార-భూపదశరథకు
మార-భూభారహారా॥హా॥జయజానకీరమణ॥ ఉ॥ నమ్మిననిన్నెన్నఁడు వలెనౌన
బెయస్లువిరోధితమ్మునిక।నమ్మినరాజుజేసితివనాథులపాలిటిదైవరాయనే। న
మ్మమరెవ్వరికిఁ మిగులనమ్మితినిర్మలకర్మచిత్తవా। క్యమ్ములనిన్నెనమ్మితినఖండ
కృపానిధిజానకీపతీ॥ నాటరాగము-ఆదితాళము.

నమోస్తుతే।రఘునాయక॥నమోస్తు॥నమోస్తుతేరఘు-నాథపరాత్పర-ర
మామనోహర-రణజయశూరా॥నమో॥పారావారవి-హారగంభీర-పాథోధిశ
యన-పంకజలోచన॥నమో॥మందరగిరిధర-మహితవిచార-మానితకాసార-
మణిమయహార॥నమో॥వారణదుఃఖని-వారణశుభకర-నారసింహదాసావన
లోల॥నమోస్తుతేరఘునాయక॥ మ॥ఘనవైకుంఠమునందురత్నమయప్రాకా
రాంతమైనట్టిచం। దనవృక్షాంతికమందుభవ్యమగునానందాఖ్యనప్రాంతరం।
బునహార్మ్యాంతికరత్నవేదికపయినన్బొప్పునన్శేషశా।య్యనులక్ష్మీయుతుఁడై
వ తారకునిరామాధీశుసేవించెదన్॥

ఎఱుకుల కాంభోదిరాగము - ఆదితాళము.

శరణుభద్రశైలనాయకా-కావుకావు.శరధిగర్వదళనసాయకా ॥ కరుగ
దాయెనేమొహృదయము-నన్నుబ్రోవ-గరుణరాదిఁకేమిపాపము॥శరణు॥పలు
కవేమిసేయువాఁడను-అన్నిటికిని-బ్రాపునీవనియున్నవాఁడను॥శర॥ పామరుల
ను జేరనంటినీ-నేడునీ-పాదయుగముఁజూపుమంటినీ॥శర॥ ఘోరసంసారవార్ధి
ని-మునుగలేక-కోరిమిమ్ముగొల్తునంటిని॥శర॥నారసింహదాసపోషక-భక్తహృ
న్నలినమిత్రశత్రుదూషక॥ శరణుభద్ర ॥

నాదనామక్రియరాగము- ఆదితాళము.

సంధీచరణములు-తోహరా.

శ్రీరమ్యంబగుభద్రాచలశ్రీ-సీతారాములకృపను-
ధారుణిలోతూము-నృసింహదాసుఁడు-ధన్యుఁడై మోక్షముగనెను॥
ఇదివినరయ్యశ్రీరామరామయన-నింపుగనీభువిజనులు-
ముదమునతూము-నృసింహదాసువలె-మోక్షమొందుదురుఘనులు- ఇది-
ఏబదియారుదేశంబులలో - నెన్నఁదగినగోలకొండక్ -
తాబలుఁడైయా-నగరమేలుమను-తానీషాప్రభుఁడుండెన్॥యిది॥ ౩॥

ఆపురమునకును-దూరుపుభాగము-నందునగృష్ణానదికిఁ
పడమర పార్శ్వము-శ్రీనరసింహులు-ప్రభలెడుమంగళగిరికిఁ॥ఇది॥ ౪॥
పశ్చిమమున-గుంటూరుపట్టణం-బందునగలుగువిప్రులలో-
పుత్రులకొరకై-సీతారాముల-పూజించెడుదంపతులు॥ఇది॥ ౫॥
అమరపరాశర-గోత్రంబునతూ-మన్వయమంత్రికనులా-
రమణిబోలు-వెంకమ్మకుసుతుడై రహివహించెలోకములు॥ఇది॥ ౬॥
పుత్రుడుద్భవించిన-సంతోషము-బోల్పలేములోకములో-
భద్రగిరీశుని-కృపచేఁగల్గెను-భవ్యగుణుండు-భక్తులలో॥ఇది॥ ౭॥
పుట్టినదినమున-భూసురులందరు-పెంపొందఁగదీవించి-
గట్టిగ రాముని-కృపకుఁబాత్రుఁడనిఁ ఘనముగానుమదినెంచి॥ఇది॥ ౮॥
జాతకర్మ-పుత్రోత్సవములను-జయశబ్దంబులతోను-
ఖ్యాతిగనరసింహ-దాసుండనుచును-ఘనముగనామంబిడెను॥ఇది॥ ౯॥
పెంచిరిపుత్రుని-సంతసమునబహు-ప్రేమ్మతోడఁబోషించి-
పంచాబ్దంబున-విద్యాభ్యాసము-బాగుగాను జేయించి॥ఇది॥ ౧౦॥
ఉపనయనము మొదలైన-కృత్యములు-యుక్తకాలమునఁజేసి-
అపరమితంబగు-నాంధ్రసంస్కృతము-లందుసమర్థునిఁజేసి॥ఇది॥ ౧౧॥
సంగీతముసాహిత్యముమొదలగు-సకలవిద్యలను నేర్చి-
శృంగారంబుగకవనము జెప్పెను శ్రీపతిపదములు గూర్చి॥ఇది॥ ౧౨॥
అంతటఁదలిదండ్రులుపుత్రకునకు-సన్నాహమైనకాలమున-
బొంతనంబుసరిగలకన్యసుతము-బోలుచుట్టములలోన॥ఇది॥ ౧౩॥
సుముహూర్తంబునఁదెచ్చివివాహము సొంపుమీరఁజేయించి-
సమముగానుబ్రాహ్మణులకెల్లను-సంతర్పణమొనరించి॥ఇది॥ ౧౪॥
ఐదుదినములవివాహోత్సవము-లమరగాను జేయించెఁ-
సాదరంబుననుపుత్రునితోడను-సంతసమునసుఖియించెఁ॥ఇది॥ ౧౫॥
కొన్నాళ్లకుగుంటూరిలోడివిజన్-కొలువుజేయుటకుఁజేరి-
యున్నతంపుదశలోనుండెను-సర్వోత్తముఁడనఁగనుమీరి॥ఇది॥ ౧౬॥
లౌకీకమునందున్ననురాముని-లావణ్యముమదినెంచుచున్-
ప్రాకటముగసంగీతవాద్యముల-భక్తిమీరనటియించు॥ఇది॥ ౧౭॥

వ॥ ఈప్రకారంబునలౌకికవైదికధర్మంబులనుష్ఠించుచు నిహపరసాధకంబగు శ్రీభద్రాచలసీతారాములంగూర్చి కీర్తనలుపాడుచునాడుచు సమస్తసంబులకుఁదెలియుటకై రాములందలంచియిట్లనికీర్తించెను॥

సౌరాష్ట్రరాగము - రూపకతాళము.

భజనఁజేసెవిధముదెలియండీ- జనులారమీరు- నిజముగనుగొని మోక్షపదమందండీ॥భజ॥భజనఁజేసెవిధముదెలియక-నిజముగాహరిభక్తులనుకొని- మదగజమువెగ్రవేయలేకనుసుజనులనిహిరుగంగనేలను॥భజ॥వారువీరనియెంచఁబోకండీ-నరులారమీరు-నోరుచచ్చినవారుగాకండీ- వారువీరనియెంచుటెల్లనుసారములేనట్టిహీనత-పౌరుషులకేగాకపుణ్య-ధారికఫలందేమియున్నది॥భజ॥జ్ఞానులనుకొనియెగనిపడకండీ జనులారతత్వ-జ్ఞానమందేమననునిలపండీ- జ్ఞానులనుకొనియెగనిపడియుజ్ఞానములుపైఁబెట్టుకొనినను- మానసంబునఁబుట్టివచ్చియుఁబూనిమరిజన్మంపుపలయును॥భజ॥ఘూటమాటాలాడఁబోకండీ-నరులారకలియుగ-నాటకములోఁజిక్కఁబోకండీ_ ఘూటమాటాలాడిపొట్టకూటికివేషములుదాల్చక-మాటికిఁసుఖబాధలాచేఁగాటికిబోవంగనేటికి॥భజ॥మూలస్థానముఁదెలిసిబ్రతుకండీ-జనులారమీరు-మేలిమిగశ్రీహరినివెదుకండీ- మూలస్థానముదెలిసిమేలోఁజాలగావెలిగేటిజ్యోతిలో- లీలమైవెలుగొందుచాలుననీలమన్మయముఁ వదలకు॥భజ॥పరమశ్రీనరహరినిఁగొలువండీ జనులారమీరు-పరమపదవినిబొందగోరండీ పరమశ్రేష్ఠకాద్రినరహరిపరమభక్తవరులనునుకొని-వివిధిగానరసింహదాసునివరకవిత్వముసారమనుకొని॥భజ॥

శా॥ సాంకేతాంతరరత్నమంటపవిరాజత్సింహపీఠంబునం । బెకాష్టచ్ఛదపద్మకర్ణికనుదానింపొందిశాఖామృగా।నీకంబున్నజనోదర్థులాలువఁగాఁబాణినోఘధముద్రాంకుఁడౌ।కాకుత్స్థన్వఘు రాముఁడాఁకుమదిన్గాంక్షించి సేవించెదన్॥౫

సౌరాష్ట్రరాగము—ఆదితాళము.

వినవేశ్రీరామునికథలు-నోటయునవె-శ్రీరామునికథలు॥ వినవేరామునికథ-వీనులనిండను-మనుజాధములవేషు-మాటలుడిగినేను॥వినవే॥అనిశముపొట్టకైయాత్రితోడనీవు-పని-బూనితిరిగిన-ఫలమేమిగంటివి॥వినవే॥విషయాదులనుగూడి-విఱ్ఱవీగుచునీవు-విషమమృతమని-గోలి-వెఱ్ఱివైతెలియక॥విన॥ పనిలేనిచోటను-పనులుకల్పనఁజేసి-శునకమువలెతిరిగి-చూప్పేముగనైతివి॥వినవే॥వాసిగభద్రగిరీశునిదాసానుదాసులతోఁగూడి-తలఁపులుడిగినీవు॥వి॥ సురుచిరమగుతత్త్వము-నరసింహదాసుని-వెలుపింపఁబోకవివేకముతోనీవు॥వి॥

మధ్యమావతిరాగము- అటతాళము.

రామునామామృతమెనీకు-రక్షకంబనుకో వెమనసా॥ కామక్రోధలోభాదులను-ఖండింమనీనామమహిమ॥ రా॥తల్లితండ్రియెవరు-నీవుతల్లినోవువేళరారు

యెల్ల బాంధవులు చుట్టాలు చేయునుగ తిరస్కరింపలేరు॥ రాము। ధనము వెంటరాగలిగి
యున్న-తనతో డుత-తగిలి రాదు-తనయులెందరున్న గాని-తనవిధి తప్పింపలే
రు॥ రా॥ నేరిచి నేరక చేయు నిన్ద్యకృత్య విధులు నేను-సారసాయకుని క్షమించి-నర
సింహదాసునిగాడ॥ రాము॥ ఉ॥ రాముడు ప్రోచు సంతతము రాముని మించినది
రాము చేతము। తాల్మి మితముగా నెంచునని ఎంచుబున్న రాముని కేను మ్రొక్కి పక॥
రామునకే కర్త - చెప్పఁడేక రాముని పాదము నెంతు రాము పై ప్రేమ చేలంగుచు ష్టు
దయవీధి వసింపుము రాము నే చెదక॥

## కాపి రాగము - త్రిపుట తాళము.

పుట్టఁగా నేనెల వారికి భువిలోన-బుట్టఁగానే॥ పుట్టు పాపులేని గట్టు చెలి
సిహంస్థి-గట్టి గాదు విలోన-గట్టి వేసిన వాఁడు॥ పు॥ మూంటి నెంచి నేగ మూంటి
మూటిని దెలసి-మూటి నేకము జేసి-మూడాల మెరుగనివాఁడు॥ పు॥ ఖేదములకు లోనై-
నైన కామములను-శోధించి వెగ్గ్రంచి శుభములం దనివాఁడు॥ పు॥ పరగ శ్రీహరి
కథఁ-బాడక నాడక-మరియు చదివి వినఁడు-మూర్ఖ ప్రజన్మము॥ పు॥ చాలజాల కము
సం-సారమె స్థిరమని-చాలిమి భద్రాద్రి-ధామునిఁ గొల్వనివాఁడు॥ పు॥ గారవమున
తూము-నారసింహదాసు-తారకనామము-దలచుచుండనివాఁడు॥ పుట్టఁగానే॥

## వకులకాంభోజి రాగము - ఆదితాళము.

ఎందుకే యీ వట్టి బాధలు- నీకెందుకే॥ ఎందుకే బాధలఁ జెందుచునుండెద-
వందముగా ముచ్చి-కుందవరదయున॥ వెం॥ సందడిబడి భయ-మందుచునుండెద-వం
దము గా రఘునందనుపదయుగ-మందునగలమకరందము గ్రోలక-పందివలె నును
ద-మందిలి తిరిగెదవు॥ ఎం॥ ఇంద్రియములచే-సందడి బడుచును-నిందు సుఖము లే దని
మనువినుచును-ముందు జరుగు వారలఁ దాగనుచును పొందుగ హరిగో- విందయను
నవునీ॥ వెం॥ కామాదులచే-గట్టువడుచు భువి బామరజనముల-వేమరు వేడుచు నే
మము చెడి యన్నుని-ప్రరికి నేగుచు రామ-రామ రామ శ్రీ-రామాయనవిక॥ ఎం॥ చే
రువయైమృత్యువు గనుబట్టగ దారా-పుత్రులంతము గతికే ద్వగ- మీరి శ్వాసకుత్తు
క కెగదట్టగ-నారాయణ నారాయణ యనవిక॥ ఎం॥ వే రెవ్వరు దిక్కు-కనికునుగల
వారము నెంచుగ-ర్వించగ బోకను-జేసితూము నర-సింహునిగూడియు-దారి దెలిసి
శ్రీ-హరిహరియనవిక॥ ఎం॥ ఉ॥ రాముడభీష్ట దైవతము రాముని భావన చేయుచుం
దు శ్రీ। రాముని చేతమద్దుకిత రాసులడంగును రామభర్తకే। ప్రేమను మసరించితు
రఘువీరునికంటె పరంబు లేదు శ్రీ। రామునకేను దాసుడను రామునియందలి భక్తి
నాకగుక॥

హితమతినుంచుటెన్నటికో - భక్తిగలిగూడి వసియించుటెన్నటికో ॥
పోషింపఁగలుగుటెన్నటికో - నన్నుదూషించు వైరులఁద్రుంచుటెన్నటికో॥ రా॥
కష్టముదీర్చుటెన్నటికో - సాయుజ్యదేవముసీపై మేలుటెన్నటికో ॥ రామ ॥
నీసేవగలుగుటెన్నటికో - భద్రాద్రీశుని ధ్యానముచేయుటెన్నటికో ॥ రామ॥
ఆనందభరితమెన్నటికో-తూమునరసింహదాసుని బ్రోచుటెన్నటికో॥ రామ॥

చ ॥ కరములఁశంఖచక్రములు కంధరమందునదారహారముల్ । వర కలలాట భాగమున భవ్యలలామము దేజరిల్లుచు । స్ఫురితచిదాత్మ రూపకుని భూరిభుజంగమ తల్పకస్థితుఁ । ధరణి సుతాధవా సహితు దాశరథిఁశర ణంబువేడెదన్॥

శంకరాభరణ రాగము - ఆదితాళము-

ఏమరకుమిమనసా - రఘురాముని॥ నేమరకుమిమనసా॥ యేమరకుమి రఘు- రామానిన్నుదువబ తామరసంబులు- దలఁపుచునుంచుచు॥ యేమ॥ మొసల మూగాకథ మెరిఁగిరక్షకుడు- హస్తివేళను- హస్తగణము మరి॥ యేమ॥ పంచ ప్రాణములుపట్టితీసుటకు - మించినృత్యువ్రగని పించుసమయము ॥ యేమ ॥ నమ్మకలేదిది- నాలుగుదినముల - బొమ్మలాటగని- నమ్మిశ్రీరాముల॥ యేమ॥ డాసినదూతల- వేసరుగనిద్రుంచ- బాసిటె మతగిభద్రగిరీశు ॥ యేమ॥ దారా పుత్రులనుతలపుమరచితూము - నారసింహుఁడెదనమ్మినరాముని॥ యేమ॥

సౌరాష్ట్రరాగము - ఆదితాళము-

ఇంకాసంసారముతో బొందేలా ॥ శ్రీరాముని దలచక॥యింకా॥యింకాసంసృతిపంకములోయమకింకరులకు బహు-కొంకుదలచితివి॥ యింకా॥ దారాపుత్రులుదల్లిదండ్రులును-రారునీకువరి- దారిజూపుటకు॥ యింకా॥ ధనము నైకెతనతనునమ్మియుమది- ఘనదుఃఖములను- గాంచియలసితివి॥ యింకా॥ నేటివరకుబహు-కోటిజన్మములు-సూటిదప్పిపరిపాటిగాంచితివి॥ యింకా॥ బంధుజనమ్ములబంధకములఁబడి- దంధనమునమదిఁదలపకఁజెడితివి॥ యింకా॥ లోకవార్తలకులోనైతిరిగిపవేకముమరచితి- వీఁకతనమ్మున ॥ యింకా ॥ దొరలకు దొరమై-ధరణిజపతియై- మెరసినశ్రీరఘు- వరునిఁగొల్వకను॥ యింకా॥ వాసిగభద్రగిరీశుఁడునరసింహ- దాసునిబ్రోవను- దయగలుగున్నాడి ॥ యింకా ॥

ఉ ॥ తారక నామమంత్రరుచి దత్తసుతా రమణుండెఱుంగునీ । పావనపాదపంకజ ప్రభావమహల్య యెఱుంగుమిక్కిలిం । దేవరదోర్బలంబు శివదేవుని చాపమెఱుంగునీదుమే । ధావిభవంబుగల్గు శరధాటిసముద్రుఁడె ఱుంగ రాఘవా॥

తోహరా. అనుచు గీర్తనలు శ్రీరాముని పైనంకితముగఁ జెప్పగను-
జనులందరు విని యానందించి జన్మము సఫలముగాను॥యిది॥ ౧౮
రామదాసువలెనీతఁడు పుట్టెను రమ్యముగా భువిలోను-
శ్రీమీఁదఁగ బహుకైంకర్యంబులు చెన్నలరఁగ జేయుగన॥యిది॥ ౧౯
అనియాపురజనులాడుచుండగ ఆత్మానందము తోడన్-
వినియుబ్బగ భజియింపుచుండెను విబుధవరులు తనుఁబొగడన్॥యిది॥ ౨౦
చైత్రశుద్ధపాడ్యమినినము నఁగదు సంభ్రమంబు మీఁరఁగను-
చిత్రముగానుత్సవమొనరించెను సీతారాములకిలను॥ యిది॥ ౨౧
నవమినాడు కల్యాణముఁ జేసెన సకలుసుకలు జూడఁగను-
అవనిబ్రాహ్మణులు వేదరవంబులు హరిభక్తులు పాడగను॥ యిది॥ ౨౨
పిదప భక్తి విప్రోత్తములకు విందులమరగా బెట్టి-
ఆడుచుండె శ్రీరామాయని తనయఘము లెల్లఁబోగొట్టి॥యిది॥ ౨౩

పున్నాగవరాళిరాగము - చాపుతాళము-

ఇందుకైన నభిమానములేదా యిదిసమయముగాదా॥ కొంచపుజనులిటు వంచన సేయ సహించియుండుటవాదా రామ॥ యించు॥ పంచశరుని గన్న పరమపురుష నీ మ్రోపునమ్మిన జనుల - వంచనఁ జేసినఁ గొంచమెవ్వండో యెంచిచూడగరాదా - మర్యాద॥ యించు॥ ఉదరపోషణకు నీవిధమున జనులనేనాడిగి వేడఁగవలెనె - సదయ నీవిన్న - సాకిప్రోవనీ హృదయమునను దోఁచదా- తరిగాద॥ యించు॥ సొగసుగ శ్రీభద్రగిరియందు నెలకొన్న బిగువా లేకనునగవా-తగవా శ్రీనరసింహ- దాసుని బ్రోవఁ-దగవా యోహో రాఘవా- యిటలేవా॥ యించుకైన నభిమానములేదా॥

ఇవ్విధంబున శ్రీరామోత్సవంబు ప్రతిసంవత్సరంబును జేయుచుండ నొకనాడు రాత్రి నిద్రించుతరి తనకు స్వప్నంబున శ్రీరామదేవుండు సీతాలక్ష్మణసహితంబుగా సాక్షాత్కరించి నీవు మన్నిలయంబగు శ్రీభద్రాచలంబునకు వచ్చిన నీకోర్కె సిద్ధించునని యానతిచ్చి యంతర్ధానమాయె నంతట నిద్రమేలుకొని కనులువిచ్చి చూచి తనకెదుట నారామదేవుండు గానమిం జేసి యిట్లు కీర్తించుచున్నారు॥

జంగలరాగము - అటతాళము-

దాశరథితోడసరిదైవమేదే - మనదాశరధితోడసరిదైవమేదే॥ దాసులను బ్రోవఁదలిదండ్రిక్రియ నొప్పుమన॥ దాశ॥ గాసిఁబడి వేడినను దాసికడతేర్చుటకు వాసిగలిగన్న రఘువంశభవుడైనమన॥ దాశరధి॥ ఘోరకాకాసురుఁడు

చేరియుపరాధీనసకోరిశరణన్నంగడతెర్చినదాతమన॥ దాశరథీ ॥ వారినిధిగ
ర్వమొకసారిబాణంబునను-జూరంబుచ్చినదయవారధియగువాన॥దాశరథి॥వింత
గనువార్ధినొకగంతునదాటినహనుమంతునేలినబలవంతుడైనట్టిమన॥దాశరథి॥
రావణునితమ్ముడోగి కావుమనివేడినను - పావనునిజేసి సంభావ్యుడైనట్టి
మన ॥ దాశరథి ॥ కూమితోభద్రగిరిజేరి నరసింహులను - వారకనుబ్రోచు
రఘువీరుడైనట్టిమన॥ దాశరథితోడనరిదైవమేదే॥

కాంభోదిరాగము - అటతాళము-

రామనామమేజీవనము - భక్తవనమువతితపావనము ॥ సీతా ॥ హరి
దాసులజతగూడుదము - వారిననుదినముచగొంయాడుదము - రఘువరునిస
త్కథలెల్లబాడుదము శ్రీధరునిగొల్వనివారివీడుదము - సీతారామ ॥ రామునిం
డెదోరయని- వలుకుదము - యితరరాజసేవనేల- యలుకుదము భక్తిప్రేమజ
నులమీద-జిలుకుదము భువి-పామరులనుజూచిదయలకుదము॥ సీతారామ ॥ ఘట
వస్థిరమనిచాటుదము- యమభటులదూరముననే- మాటుదము యీచటులసం
సారాబ్ధిదాటుదము - యొక్కచిటికెనుయఘములమీటుదము॥ సీతారామ॥ ప
వశాయిగనుగొనిమ్రొక్కుదము- రఘువీరునికథలువిని సొక్కుదము- దుర్విష
యాదులను దెగచెక్కుదము- వరివిబుధాహితులపొందుదక్కుదము ॥ సీతా
రామ॥ సంసంపదలువిడజిమ్ముదము - నరసింహావనుని నెరనమ్ముదము- భద్రగిరి
నాథునకు దేహమమ్ముదము- అని- తరయోగ్యముననుంటసమ్మదము॥ సీతారా
మనామమేజీవనము॥

ఆనందభైరవిరాగము - చాపుతాళము-

చూడవేడుకాయనే -. సుందరాకారునిముద్దుమోము॥ చూడ॥ చూడచే
డుకాయెభక్తితోడసీతాకాంతుసన్నిధి - గూడివేడుకగపాటలు - బాడియాడి
కన్నులనిండ॥ చూడ॥ చందురుంగేరుమోమునా - మందహాసముతోడదాసుల
నందరింబ్రోవందలచుగోవిందుసుందరమిందుంగన్నుల॥ చూడ ॥ తేడకస్తూరితిలక
ములలాటమందుమెరయభక్త - కోటింబ్రోచు శ్రీభద్రకుధరనిలయుని గన్నుల
నిండ॥ చూడ॥ వాసిమిగులభద్రశైల - వాసుదేవ్వుడు నారసింహ- దాసహృద
యకమలమునిని- వాసుడైన సొంపుగన్నుల॥ చూడవేడుకాయనే॥

మ ॥ ఇరుగడలందులక్ష్మణ మహీసుతలుక్ జెలువొందగూణముక్ ।
శరముశరాసనంబు వరుసంజరమాంగ కరంబులందువి । స్ఫురతందనర్వభక్త
జనపుంజవివర్ధరుడైనరామభూ । వరుండుజగద్గురుండు-భగవంతుడనంతుడు
నన్నుబ్రోవుతన్॥

. మ ॥ శరచాపాబ్జరథాంగముల్కరచతుష్కప్రాప్తమైయుండను । స్థిరవామాంకమునందుసీత నియతిస్సేవింప భద్రాద్రిపై । నిరవైనట్టి సరోజనేత్రుఁబరుయోగీంద్రేంద్ర సంస్తోత్రుభా । సురకేయూరవిభూషణుం దలఁచెద స్వాంతరంగంబునన్ ॥

అసావేరి రాగము . అటతాళము.

రక్షకుఁడౌనీవు - నీకెగిగి యుండఁగమాకు- రామరామభయమేలనే॥ పక్షివాహనజగద్రక్షకసేనికటాక్షమేగోరితి- మోక్షదాయకరామ॥రక్ష॥ అపవర్గములచే-నదఁబెదరిపరుల-నాశ్రయించఁగమాకేలను - మరుగులేని నామమంత్రమనేవం । జరముగలుగఁజేసిజడియకుమనిప్రోచే ॥ రక్ష ॥ తెలిగియీసంసారచక్రమునుదగిలి - సోలసివేసార మాకేలను - అలసులైనవారి నన్యాయము గఁజేరి-కలవరమందమాకేలను॥ రక్ష॥మేరలేని సం - సారవారిధిలోనఁ జేమమునుఁగమాకేలను - కోరిభద్రశైల - కూటవాసునిఁజేరి నారసింహదాసుఁడనియున్నవాకిఁక॥ రక్షకుఁడౌనీవు॥

గీ ॥ అనుచు నేకతంబనాలోచనము జేసి । యర్ధరాత్రివేళ నవ్వుగాఁగ । స్వప్నమందువచ్చి చెప్పినమిపలుకు । లొప్పుగాఁగఁజేయు టెప్పుడోకో ॥

వ॥ అనియిప్పుధంబున రాములందలంచి ప్రార్థించుచు-

ద్విపద-

ఆసతోకొన్నాళ్లకానరసింహ- దాసుండు శ్రీహరిదాసులగూడి- రాగంబుతోడ భద్రాచలేశ్వరుని - బాగుగాసేవింప వయునమయిపోవ . అమరినతనవనులన్నియు మాని - తనవారినందఱుదలచకవిడచి । రామరామాయని రాత్రిందివములు . ఏమరకభజించియుండవానలను - ఘోరాటవులయందు గ్రూరసత్వములు- బారితన్నొందకభక్తికిరెట్టింప । శ్రీరాములున్నట్టి శ్రీభద్రగిరిని- మారంబుననుజూచిదోత్తోడమ్రొక్కి . తనతోడవచ్చు వారలకట్టులనియె॥

వరాళిరాగము - ఆదితాళము.

అదిగోభద్రాద్రిగౌతమియిదుగోచూడండి- ముదముతో సీతా ముదితలక్ష్ములు- కదసికొలువ గారఘుపతియుండెడి॥ దదు ॥ అనుపమానమై యతిసుందరమై- దనరుచక్రమునధగధగమెరసెడి॥ దదు ॥ చారుస్వర్ణ ప్రాకార గోపురద్వారములనుసుందరమైయుండెడి॥ దదు॥పొన్నలపొగడలపూపొదరిండ్లను । చెన్నుమీరగనుశృంగారంబగు॥ దదు । కలియుగమందునగలవైకుంఠము । నలరుచునున్నదినయముగమ్రొక్కుడి॥ దదు ॥ శ్రీకరముగనరసింహదాసునకుప్రాప్తై యుండెడిరఘుపునివాసము॥అదుగోభద్రాద్రి॥

వ॥ ఈప్రకారముగా కోవెలగోపుర ప్రాకారముల వైభవంబు చూచుచు భద్రాచలంబుచేరి గౌతమినదిం గాంచి హరిదాసులుం దానును స్నానంబులు చేసి సీతా రామలక్ష్మణుల సేవించి తీర్థప్రసాద తిరుమాల్యంబు లంగీకరించి ఆనందంబునొంది యిట్లని కీర్తింపు చున్నారు-

శంకరాభరణము - ఆదితాళము-

నమోనమోదాశరథే - నమోనమో । నమోనమో సుజనావనదీక్షా- యువసుతసుమహిత- విమలకటాక్షా। నమో ॥ కౌశికసుతాధ్వర - కుశలధురీణా.వసుమతీసుతహిత-వనరుహరుచనయనా॥ నమో॥ అనుజసతీయుత. అజభవసేవిత-దనుజకులాంతక- దశముఖహరణా। నమో ॥ వరభద్రాచల-వాసవిలాస- ధరణీనరసింహ- దాసవిలాస॥ నమోనమోదాశరథే॥

అసావేరిరాగము - చాపుతాళము.

ధన్యుడనైతిమీ- దర్శనమున రామ - దానుడనగ నేటికి ॥ అన్యులవేడనే నాసచేయకయూ - వన్నెరక్షణంబునన్నే సన్నుతిసేయుచు। ధన్యు ॥ ముందు మీ శ్రీపాద- మందున్నయుందియ- లందముతో మ్రోయగ - సుందరముగుమించి తుందవరదరఘు- నందనపదయుగ- మందుమనసునుంచే ॥ ధన్యు ॥ నిడుదలై మీ తొడ- పైకడువేడ్కపుష్పమిశ్రనయయుండగ- అడుగడుగునకు మీ- నిడువదపద్మము- తడసేయకనదిం- దడయక సేవించి । ధన్యు ॥ సరసముగను శ్రీ-వరభద్రాచలమేమి- కిరవుగయుండిననేమ- వరదుడనై తూము - నరసింహదాసుని - అరసి ప్రోచెదురఘు- వరునికరుణచే॥ ధన్యుడనైతి॥

మ ॥ కమనీయావనిజాతమానసమహాసారసాగహంసుడై హిత । త్రుము దైత్యాంతకుశాంతరూపు విబ్రహ్మాండసంసార సంతాపఘ్నా । రమహాంభోనిధి తారణుడు రఘువరుడు రాజీవపత్రేక్షణుడు । విమలుడు దారకబ్రహ్మముడు దలచి సేవింతుడు కృపాకాంక్షినై ॥

బిలహరిరాగము - చాపుతాళము.

నీమోముజూపినజాలు - రామ - నిరతముమానువేయివేలు । తేటకస్తురిబొట్టుతీరు-మాట-మాటకిమదిగనగోరు।నీమో॥మెరుపుటద్దములను గేరు మంచినరసంపుచెక్కిళ్లతీరు-గల॥ నీమో॥ కన్నులగాటుకగుల్క - నీ - కరుణారసమునావయిజిల్క-రామ ॥ నీమో ॥ శ్రీభద్రశైలవిహారా - ఆశ్రితజన బృందమందారా-రామ॥ నీమో॥ ధరణిజవరచిత్తచోరా - తూము-నరసింహవనకరుణాపూర॥ రామ॥నీమోముజూపిన॥

సావేరిరాగము - ఆదితాళము.

నేడుగదా రఘురాముని పదములు । చూడగల్గెను సకు ॥ చూడఁజూడఁదొలిజన్మఫలంబని । చేడియ నామది వీడఁగదో చెనో ॥ నేడు ॥ రాగాదులు విడనాడి మనమున నను । యోగులు గొలిచిన యోగ్యమే మొ - భాగీరథిఁగన్న భాగ్యమునను హరి । భక్తుల సేవకుఁ బాత్రుఁడనగుటనో ॥ నేడు ॥ యింక పెలోన మనుజన్మంబున - నేమి దానములు యిచ్చితినో । సాములఁగన్గొని సాగి నమస్కృతులేమయినఁ జేసితి నేమొ యా ఫలమున ॥ నేడు ॥ కారులుపల్కగకదు వేదుకతోఁ - గోపాలుని మదిఁగొలిచిన ఫలమొ । ధారుణి నరసింహదాసుఁడనుచు - పేరు ప్రతిష్ఠఁ బెట్టుకొన్నందుకు ॥ నేడుగదా రఘురాముని -

మ॥ శ్రితపాపాటవివహ్ని దైత్యఘనధరిత్రీభృత్పవిం గాయకస్తుతు । శీతచంద్రాననుశాంతు దేవమునిసంసేవ్యుం ఘనీలాకృతిన్ । స్మితవక్త్రుం దశకోటిసన్నిభమణీసింహాసనస్థానసంస్థితు శ్రీరాముని నాతమందు మదినేఁ జింతింతు నిష్టాప్తికిన్ ।

వంతువరాళిరాగము - చాపుతాళము.

రామనీవాఁడసుమీ - యికనునన్నుఁ । బాముల బెట్టకుమీ ॥ రామనీవాఁడనై । యేమని భువిలోయి - సామాన్యులతోనా । కేమి దెల్పుకొందు ॥ రామ ॥ దిక్కు నీవే యుంటిని । నామదిలో నెప్రొక్కు వేఁడుచుంటిని । యొక్కసారైన నీచక్కని మోమునా । దిక్కుఁజూపవిది । యెక్కడిచిత్రము ॥ రా ॥ యొరుల వేడనంటిని నీపాదముల - మరువక నేయుంటిని - గరుడగమన మీకరుణరావలెఁగాక । మఱచియుండిన నాతరమా యాదికొల్ప ॥ రామ ॥ శక్తివంచన లేదుగా - నీవయిన ఆసక్తితోడ తనుంటిగా - యుక్తని జేసినీ - భక్తులతో పాటు - ముక్తిగతునిగాన - వ్యక్తనిఁ జేయకే ॥ రామ ॥ తిరవుగాదు దేహముకు - విదుటకునై - తరముగాదు మోహము - గురుతరశల్యసంగతమయినదీక్కై - మురియుచు భక్తుల - తెరగు దెలియనైతి ॥ రామ ॥ మొరవిన వేమి సేతు - యీసంసార - భరము నే నెటుగాఁ ద్రోతు - గరిమతోడుత తూము - నరసింహుఁడను భక్త - వరునితోడను నేమరకుండు రఘురామ ॥ రామనీవాఁడసుమీ ॥

గీ॥ భద్రగిరినాథ నీకు నే బంటనైన నేఁడె - మద్రదయ సేయుమో రామ మును మెలర్ప । నిద్ర నుగల్గునట్టి యాలీగ పాశిఁ । జూడఁ నేగెద నెలవిమ్ముఁ జూడ్కులలర ॥

వ॥ ఇవ్విధంబున వేడుచు పాడుచుకొన్నిదినంబులుండ పిమ్మట హరిదాసులం గూడికొని నుత్తరంబున నయోధ్యయు పశ్చిమంబున పాండ్యాపురంబును దక్షిణంబున శ్రీరంగ రామేశ్వర సేతువు మొదలగు తీర్థయాత్రలు సేయనిశ్చయించినవారై సీతారాములం జేర్కొని యిట్లనుచున్నారు ॥

ఎరుకలకాంబోధిరాగము - చాపుతాళము.

సెలవా మాకిక సెలవా- రామయ్య॥ సెల॥ సెలవా మాకిక శరణాగత వర- భరణా భవతరణా రామయ్య॥ సెల॥ కలలోనయిననుగలిమిగోరనినుఁగన్గొనఁగోరెదను రామయ్య॥ సెల॥ చరణాబ్జంబులఁజూడకనిమిషము- సైపలేకను గదవె రామయ్య॥ సెల॥ కరుణమాలినను బ్రహ్మయినఁగతిని - గావించెనుగదవే రామయ్య॥ సెల॥ యేమిసేతునే నెట్లుసైతునిక- యేమిగతియోగదవె రామయ్య॥ సెల॥ నానోముఫలముయిటుఁబామఁబెట్టఁగ - సామియేమనందు రామయ్య॥ సెల॥ నిన్నెడబాసిచనుటకునామది రాదన్నదియేమిసేతు రామయ్య॥ సెలవా మా॥ ఎన్నివిధములను- నిన్నెకానిమరి- యన్యమెఱుఁగఁగదవె రామయ్య॥ సెల॥ మర లివత్తునామనవిచెవిగైకొని- మదిదయయుంచఁగదె రామయ్య॥ సెల॥ వరభద్రాచలపురరఘువరనను- వదలజాలమేల రామయ్య॥ సెల॥ శరణుశరణుమీశరణని రఘువర- కరుణార్ద్రాభరణా రామయ్య॥ సెల॥ గరివతోడనరసింహదాసునకు- గతినీవే రామయ్య॥ సెలవా మాకిక॥

సురటిరాగము - ఆదితాళము.

పోయివత్తునటవె- ఓజననీ- పోయివత్తునటవె - పోయివత్తునటవె పొందుగనీదయఁ - బాయకయుంచవె- బంగారుతల్లీ॥ పోయి॥ కన్నతల్లివికానవు పైభ్రమ- యున్నకతనమదింజెప్పఁబోకుమిఁక॥ పోయి॥ రామునితోనను బ్రేమనేలుమని- వేమారుఁదెల్పెదు- విధమునీదెకదా॥ పోయి॥ తల్లిదిల్లినాయుల్లము నీకృపఁజల్లవెనాపైఁజల్లనితల్లి॥ పోయి॥ వరభద్రాచలమున శ్రీరఘువరునకుసతివై- మెరసినతల్లి॥ పోయి॥ స్థిరమతితోనర-సింహదాసునకు-సిరులొనగూర్చెడు కరుణాకరనే-పోయివత్తునటవె-

వ॥ అనియివ్విధంబునఁబ్రార్థించి ప్రయాణోన్ముఖులైపోవుచు రామకీర్తనంబులుపాడుచు నాదుచునిట్లనుచున్నారు॥

మ॥ తనవామాంకమునందలంకరణ సీతాలోకవాసక్తుఁడై- ఘనరత్నోజ్జ్వలసత్కిరీట ధరుఁరాకాచంద్రబింబాస్యుఁగాం। చనసింహాసన సంస్థితుఁడరవిజ వజ్రాన్యాస్మిసత్పుత్రసా। వనిసౌమిత్రిప్రసేవితుండగు రఘుస్వామిన్భజింతున్నదిక॥

ఎరుకలకాంబోధిరాగము - ఆదితాళము.

మనసానీకే దురభిమానమేలనే. శ్రీవనమాలిచక్రధర వైకుంఠాధ్యాత్మయనుటకు॥ మనసా॥ పరులనుయాసించుమందె- పరుగులుపారెదవుగాని- హరినామస్మరణకునీకాన క్షేత్రమేటిదేవంచు॥ మన॥ కాఱుమాటలాడిప్రొద్దు - గడప

భగణముఖ్యభక్త్రిసంసేవితుఁ । సదయాత్ముఁ రఘురాముని రఘువంశ్యామలం
దలంతుఁ మదిఁ॥

తోహర — ఈవిధముస శ్రీరాముల దలచుచు నింపుమీర బాడుచును-
సావిత్రీసుతుఁడా నాఁడాడిన సాకేతపురముఁ గనుఁ॥యి॥
పోయి చేరి యందరును పొంగుచు భూమిమేలము నాథుని-
కాయజజనకుని మందిరంబుగని కరములు మోడ్చుకొని ॥యి॥
రామా రామ మీవంటి ప్రభువులీ రాజ్యమేలవలెగాని-
సామాన్యులతరమా పాలింపగ సకలకామములనొసఁగ॥యి॥
చూడఁగ నెన్నియో సుందరపదములు చొక్కి సుప్రతకామా-
పాడఁగ వేయినోళ్లును జాలవు పరమపురుష రఘురామా॥యి॥
మీ ప్రభుత్వము చేయు కాలమున మేలిస్వర్గమునకైన-
చారుబ్రహ్మ పట్టణమునకైనను శంకరు నగరికైన॥ యి॥
మించినదై వల్యమువలెనుండు పుష్పక గుచ్ఛ గోపురములలో-
అంచితముగ నేబుట్టగనైతిని ఆ వనములనిభుపిలో॥యి॥
అనుచు నుతింపుచు నరహరిదాసుండు దుఃఖోన్నిద్రుండై-
మనమలరగ వాంఛ్యాపురమార్గమున మరలి వచ్చుచుండెఁ॥ యి॥

రేగుప్తి రాగము - ఆదితాళము -

ఏమరకుమీ మనసా - శ్రీరాముని ॥ఏమరకుమీ మనసా॥ ఏమరకుమీ రఘురాముని శ్రీపద- తామరసంబులు- దలచుచు సతతము॥ యేమ॥ రాముని సుగుణో- ద్దాముని భవజలధి- రాముని జగదభి- రాముని మిషము॥ యే॥ కాలునిదూతలు గ్రమ్మువేళ మనిను- గడతేర్చుటకు- గతియగు నామము॥ యే॥ సూరిజనులకా- ధారమగుచు భువి- చారుతరంబగు- తారకనామము॥ యే॥ దేవదేవుడై వెలసినట్టి- పావనుడగు శ్రీ- భద్రగిరీశుని॥ యే॥ శ్రీకరముగ నరసింహదాసుని- చేకొని బ్రోచెడు- శ్రీకరునెదగని॥ యేమరకుమీ॥

చ॥ సరసవిదేహరాజతనుసంభవలక్ష్మణయుక్తదేవతా । తరుసువ పూజితాంఘ్రియవతామరసద్వితముఁ సరస్వతి । శ్వరసురవర్యమానిజన వంతుఁ వందనచ్ఛ్రుతుఁ లస। ద్గుణశంచాపధారణు రఘూద్వహు రాముని నెంత నెంతయుఁ।

తోహరా — సంతోషంబున నడిచివచ్చి సార్వభౌమము పలచుచును-
వింతగాను తమజన్మభూమికి విచ్చేసి పొంగుచును॥ యి॥

వచ్చి చేరగ గుంటూరిలోనుండెడివారందరు ఘోషింప-
మచ్చికలెసగ బంధుమిత్రులతో మన్ననగా ఘోషింప॥ యి॥
అచ్యుతమాధవహరిగోవిందాయనుచును దివ్యస్తుతులతో-
ముచ్చటనా సంగీతవాద్యములు నవ్యగానునృత్యములతో॥ యి॥

శా॥ ఓ రామా జగదేకవీర రమణీయా జానకీనాయకా। యోగా
జేంద్రవ్యాపాలవరదా యోపిశ్వవిశ్వావనా। యోగాజీవ దళాక్ష యో ర
ఘువ తేయోనాధమన్నింపునా। నేరంబేమి కృపాఘనా ప్రాణుండనై నిన్నేను
దిన్నమ్మితిన్॥

తోహరా— సాగరంబున నిర్మలేశ మంచరిగె ముప్పాతిపుచును-
శ్రీరంగమునకుఁ బోవఁదలంచెను బిడ్డల గొల్లెతోను॥ యి॥
దారాపుత్రులు వెంటరాఁగ హరిదాసులతోడను గూడి-
వారకచిటితాళము గజ్జెలుసంబూరంబుతో గానముగూడి॥ యి॥
శ్రీరంగేశుని ధ్యానము సేయుచు శ్రీహరిదాసులతోను-
ఘోరతరంబగునదులువనంబులు కొండలెల్ల దాటుచును॥ యి॥

వ॥ ఈప్రకారంబున బయలుదేరి మార్గమధ్యంబునంగల గ్రామంబులను
నదులువనంబులును బర్వతంబులు దాటుచుఁబోయి పోయి॥

తోహరా— త్రోవనడుచుజనులానందింపుచుఁ దోడగూడినదువ్వను-
కావేరీతీరముఁ జేరిరి మార్గాయాసము దీరఁగను॥ యి॥
కనుగొని యఘములఁ బారఁదోలు కావేరీసలిలములను-
మనమలరఁగ స్నానంబొనర్చిరి మధుసూదనుఁ బొగడుచును॥ యి॥
నెట్టన దినకృత్యములు దీర్చుకొని నీరుకావి వస్త్రముల-
గట్టి వెట్టినామములు ధరించిరి కడు సుందర ఫాలముల॥ యి॥
తంబూరనుకరతాళము బట్టుక తాండవమాడుచు రాఁగా-
తుంబురుఁడో నారదుఁడో యనుచియందున్న ప్రజలు గనుగొనఁగా॥ యి॥
ప్రాకారము లేడును చిత్రములై ప్రబలిన పూఁదోటలును-
ఆకాశమునొరసెడు గోపురములును ఆళ్వారుల మఠములను॥ యి॥

• యమునాకల్యాణి రాగము- ఏకతాళము,

కావేటిరంగ నను గావవేరా - కావేటిరంగ నను - గావుమనుచు వేడ
రావేమి సేతురా - రాకుమారా॥ కావే॥ కోమలాంగులెల్ల చామరలిడుచుం
డ- నామొరాలింపవో కామజనకా। కావే॥ సేవకుఁడననుచు నన్నుఁ జేకొనుమంటిని
క- నీవేగతియంటి నీరజాక్షా॥ కావే॥ పాతకుఁడనటంచుఁ బట్టువిడెదవు నీచేత

గాకున్నయేమి- సేతనోహరీ! కావే॥ జాలమేలసేనీపాలిటివా- డభక్త - పా
లనలోలకృపనేలుకోరా॥ కావే ॥ కోకకనోడ తూమునారసింహదాసుని- జేరి
రక్షింపవేము- గారశా॥ కావేటిరంగ॥

శ్లో ॥ శ్రీరంగేశపదాబ్జలబ్ధహృదయక్ శ్రీచందనస్నానవి। స్నారోద్యత్
జిపీఠసంస్థితులసచ్ఛ క్రాబ్జహస్తాబ్జశ్యం। గారాకారుణికుంఠధా। హావిభక్త
ర్యంక శాయిక్ హాక్। శ్రీరామక్ ధరణీ సుతా యుతు శ్రీతాలిఈముక్
భజింతున్నిక్।

తోహరా— భజన జేయుదుబోవుదునచ్చటిభాగవతులదర్శించి-
సుజనాకిరస్సై వెలసినవ్యూహములసుందరంబులనుగాంచి॥ యి।
అందలితేరులగజతురగములనుసముత్తమైన సగోవులనా-
చందనకుసుమఫలప్రసూనమాలసకెలవ స్తుశాలలను। యి॥
కనకమయంబగుధ్వజస్తంభమునుగనిబలిపతముగాంచి-
వినయముతోసందర్శనముకోర్కెసన్నిధి మదిలోదలచి॥యి।
గరిరంగరంగాయనివాలు చిరనగ్నవుపంజరములను-
పొంగెడుపలుకులరవములవినుచు నుబూర్వసుకృతమెన్నుచును। యి।
ఆవలజయవిజయులాజ్ఞగొని రంగస్వామి సన్నిధికరిగి-
తీర్మినఫణిశాయినైనయా శ్రీరుపాదము లకెరగి॥ యి।
చపలుడుడగ పితుడుడగపటాత్ముడనేపరాధిని క్రూరుడను-
నెపమాలెన్నకనుబ్రోవుమయ్యనినునెరనమ్మిన దాసుడను। యి।

తోడిరాగము - ఆదితాళము.

వందనమిదె- శ్రీరంగానీకు- వందనమిదె॥ వందనమిదిగో - విందపరా
త్పర- బృందారకముని- బృందశరణ్యా॥ వంద ॥ కుందరదనశర - దిందువదన
మునదిందుజేయునగు- సుందరవదనా॥ వంద॥ అంగజజనకవిహంగతురంగభు
జంగశయనభవ- భంగశుభాంగా। వంద॥ ధారాధరనిభ - ధీరవిచారా-పా
రావారస మానగభీరా॥ వంద॥ తీరయుభయకా- వేరిమధ్యసువిహారత్రిజగదా
ధారనహాత్మా॥ వంద ॥ మురవిదళనతూము- నరసింహావన- వరమదయాకర,
పాతకహరణా। వందనమిదే॥

ఎరుకలకాంభోధిరాగము- ఆదితాళము.

కరుణమేదిరా। రంగయ్యానీ॥ కరుణమేదిర - కమలామనోహర । శర
ణాగతజన- శోకానవికనీ। కరు ॥ వేషధారినటంచు - దోషమెన్నెదవునా । పోష
కుడవనీవె- శేషశయననీ। కరు । తీరైనయుభయకావేరిమధ్యమునవి - హార

మునల్పునా। య్యాగరంగనీ॥ కరు॥ గరిమెతో మఱతూము - నరసింహదాస
హృ। త్సరసిజనిలయా శ్రీ- వరచిత్తచోరసీ। కరుణయేదిరా।

తోహరా— అనిబహువిధముల వేడుకొనుచు శ్రీహరినామము బాడుచును.
వనజనాభునకు సహస్రనామార్చనమొనర్చె ముదమున నౌ। యి॥
అప్పుడచ్చటలు కర్పూరఘని రాజనంబులొసగగను
దప్పక హరిదాసుడు సేవించెను దన్మయంబు గాంచుచును। యి॥
పాదతీర్థము తులసియు శ్రీశఠగోపము గ్రుక్కలొసగ గా
వేదవేద్యు సన్నిధిలోనిరువది వైభవములను గనుగొనగా। యి॥

రేగుప్తి రాగము - ఆదితాళము.

రంగని సేవింపగలిగెనమ్మ వయ్యారి మోహన॥ రంగని॥ అంగనలిరు
వురు రంగుగబడగాలు। పొంగుచునా త్రభుజగశయనుడగు। రంగని॥ తీరుగ
నుభయకావేరిమధ్యమున। మీరుచు బ్రణవాకారుడైన శ్రీ॥ రంగని॥ నాభికమ
లమున నలినజుని దుకొని। స్వాభిమానము జగముల నేలెడు॥ రంగని। ఉరము
నందు సిరిమెరగ నుండగను। గరుణాంభ త్తులగనుగొనుచుండెడు॥ రంగని॥
చారుసత్త్వప్రాకార సువర్ణ హజారమునందు విహారకుడైన శ్రీ॥ రంగని॥ కోరి
తూము నరసింహదాసునకు। గూరిమితో చవతారకుడైన శ్రీ॥ రంగని॥

ఎరుకలకాంభోధి రాగము- ఆదితాళము.

ఇదిగదా సుదినము నకు మూలము- యిదిగదా॥ యిదిగదా బ్రహ్మాదులకందని
పదవియనుచు యోగులు ధ్యానింతురు॥ యిది॥ యాగయజ్ఞతపయోగములెల్లను
బాగుగ జేయక భక్తిగొల్చుటకు। యిది॥ అగసి భక్తజనములు దినము హృ। త్స
రసిజమున భవ। హరమని గొల్తురు॥ యిది॥ శ్రీమద్భద్రగిరి- ధాముడైన శ్రీ। రా
ముడీశుడని। రమియింతురు సదా। యిది॥ వాసిగ నరసింహ। దాసునేలు
కృప- డాసికంటిమిక। ధన్యులమైతిమి॥ యిది॥ గదా సుదిన॥

తోహరా— కొన్ని దినంబులు శ్రీరంగంబున గురుభక్తులతో నుండి
వన్నగశయనుని ధ్యానింపుచు నబయనమాఘె నటనుండి॥ యిది॥

దేశిత్య రాగము. ఏకతాళము.

పాహిమాం కృపాసింధో- పరమపురుష శ్రీహరే॥ మోహలోభతావశమన-
మునిజనాభివందితం॥ పాహి॥ దనుజమదవిదారణా - దాససుజనపాలనా॥
పాహి॥ భక్తచందనాకృపాళో- భవ్యపరసిజాననా। పాహి॥ వారణాది
పాలనా- వైరిమదవిదారణా॥ పాహి॥ నారసింహదాసహృదయ। నలినదిన
కరప్రభ॥ పాహిమాం॥

వ॥ ఇవ్విధంబున బయలుదేరి రామేశ్వరంబున సేతువు మొదలగు పుణ్యస్థలంబులను జూచుచు నానాభక్తులతోడం గూడుకొని శ్రీకాంచీపురంబుం జేరి యందు రాజరాజగు వరదరాజస్వామి వారిని సేవించి నృత్యగీతంబులు సలుపుచు నిట్లని కీర్తించుచున్నారు.

శహాన రాగము - ఆదితాళము.

వరదునిఁ గంటిని- కంటిని వరదుం గంటిని। సురపురంబుగ భక్తాభీష్ట వరదుడై కరిగిరిని వెలసిన॥ వరదు॥ పాండువర్ణఛత్రము మెరయను భయపార్శ్వములను భాగవతులు- దండిగ వింజామరలు వీవ। దైవశిఖామణి వేంచేసెను॥ వరదు॥ మేవ మీరిన ఖగతురంగమెక్కి - వయ్యారి చూపులలరగ - గోపురద్వారము నందు- నమిత కోటిసూర్య కాంతితో వెలసిన॥ వరదుని॥ మకరకుండలయుగళము- మహోత్తర రత్నకిరీటము ప్రకటితకౌస్తుభహారము। ప్రేమంగులుక బిరబిర వేంచేయు॥ వరదు॥ కనకచేలము మెరయగ- కస్తూరితిలకము జారగా। మనసు రంజిలం జేయు కుసుమమాలికల్ల శోభిల్ల వేంచేసెను। వరదుని॥ వాసిగ నరసింహదాస - హృదయ నివాసుడై। భద్రాచలంబున భూసుతా సహితుడైన। రాముడు పోడిమి దాల్చి పొందుగ వేంచేయు। వరదుని॥

వ॥ ఇటులం గీర్తించుచుం గొన్ని దినంబులచ్చట నుండి మరల బయలుదేరి-

తోహరా— సేతువు మొదలగ దక్షిణపుణ్య క్షేత్రంబులనన్నియును
చేతోమోదంబున సంచారముం జేసి చెన్నగరమును। యి।
తిరువలిక్కేణిపురంబుం జేరి యిష్టముగా నందమును
వగనాత్ముండగు పార్థసారధిని బహువిధములం బొగడుచును॥ యి॥
దేవళంబునకుం బోవంగ నచ్చటం దీర్థంబు మహిళ సేయును
శ్రీవగు పాదార్చకులొసంగ దనచిత్తము సంతసిల్లగను॥ యి॥
కైకొని వేడుచుం బాడుచు వాడుచుం గనాలాత్ము నుతియించి
సాకేతపురాధ్యునకు మ్రొక్కి ఫణిశాయిం దగ సేవించి॥ యి॥

ఉ॥ శ్రీరఘురామపాదసరసీజములం దళిమాడ్కిం గాంతు పెం। పారంగ భక్తి గానసయంబుం జరించుచునుండు మానసం। బారయ రాజతుల్య ధమల్లాపికమానిరతంబు తైనపం। కేరుహపాళియందుం బదికింపరసంబా క్తై ప్రవర్తించెద॥

యదుకులకాంబోధి రాగము - అటతాళము:

చాలదా రాముల సేవ దొరికెం జాలదా। రంగని సేవ దొరికెన॥ చాలదా॥

చాలదాయిక నేలనితరభూపాలకుల వేడజాలనే సఖీ । జాలదా॥ మేలనుదుభవ జాలమునఁజిక్కి చాలఁబడలనింకేల నే సఖీ - జాలదా॥ ఆలుబిడ్డలనుజాలెలోఁబడి జాలిఁజెందనింకేల నే సఖి॥ జాలదా । మేలనింకమాటలేల నరసింహపాలకునిఁ గనచాలమేలనిది॥ చాలదా రామ॥

తోహరా— హరిప్రియయగుశ్రీవేదవల్లి తాయారునుబూజించి॥

వరదరాజు పెరుమాళ్లసన్నిధివందనంబులొనరించి॥ యి॥

నారసింహస్వామిని సేవించెను నారసింహదాసుండు

సారసాక్షునకుసహస్రనామార్చనముఁ బంచ వరగ నవుడు॥యి॥

భోగ్యమయినతీర్థముశఠగోపముఁబు ష్పమాలికలు నొసగ

భాగ్యమనుచునంగీకరించెను- దృఢభక్తులతోఁ జెలఁగ॥యి॥

కల్యాణిరాగము- త్రిపుటతాళము.

సదయుఁడవని నిన్నుఁబట్టితివే యనిహృదయముకరుగదేమి - మదముతో గజేంద్రుఁడు నాపదనెదనుకనిఁ బ్రోచుటకుమదిలో యెదవవేగమెకదలిమకరిని మదమణంచికరీంద్రుఁ బ్రోచిన- సదయ॥ శరణాగతత్రాణబిరుదాంకుఁడవనిశరణుశరణటంచును మొరలిడినయాద్రౌపదికి మనుఁగరుణతోసత్వయ పటంబులుస్థిరముగ నొదయఁజేసికురుభూవరుని బాధిదోలఁగఁజేసిన- సదయ ॥ కమవేదక్తోడముగ- బడుగుబ్రాహ్మణుడొక్కపిడికెడటుకులవ్వఁగఁ దడయకనుభక్షించి సంపదలిడినసీదగుచరియలిక నేనుడువ నేర ననంతశయనాధ్యుఁడ వనఁగ వెలసినమహాదయ॥ సదయ॥ కరిహరినరుల్లనీవరసిప్రోచినవార్తఁగురిగానేవిన్న తనవెరపుబాపెడుబిరుదుగలనాదొరవునీవనిమునినిమెంతో। స్థిరముగానెరనమ్మితిని నరసింహదాసావనవరాత్పర । సదయుడనినిన్ను॥

మ ॥ పరులన్ శిష్యులఁ దల్లిదండ్రిగురు బ్రాహ్మణ్యంబులన్ సఖ్యులన్। శరణన్వారికి నిన్ను నేనహగనాస్వాభావికల్పంచనల్ । నెఱపుంగావున నాస్వధర్మమిదిగో నేమాననీధర్మమే । మరకావన్న శరణ్యనీ శరణురామా యూతర్కరక్షామణీ॥

తోహరా— అద్భుతంబుగాఁజేయుభజనకత్యాగదంబుగజనులు

సద్భక్తుండనిసంతోషించిరిసరసనున్నయాఘనులు॥యి॥

వైభవంబుగఁ ఆనందమున వైద్యరమణయ్యగారు

ప్రాభల్యంబుగఁబ్రార్థించియుతమపేరున తిరువత్యారు॥యి॥

త్యాగరాయసన్నిధికుత్తరవు వెరవునదమసత్రము

వేగమెదోడ్పాసిపోయి చేర్చిరి వేద వేద్యదాసులను॥ యి॥

రామదాసుయీతఁడేయని మెచ్చుచు రమ్యాన్నంబులొసఁగుదు
స్వామిమీకునే దాసుడనయ్యెద సౌఖ్యాలేల నాకనుచు॥యి॥
పలువిధముల బల్కెడుయా రమణాగ్ర్య పలుకులు విఫలము గాను
కులుకుచు నాదిశవరదయవంతుల క్రూరునివలె రాగాను॥ యి॥
రమణగాయంతులు దోడ్కొని తెచ్చియుఁ గవ్యమైన సభలోను
విమలమైన విష్ణుదాసునిజూచియు విగ్రహగిరిద్దరుని॥ యి॥
సారంగము వేణువుముఖవీణెయు శరభదాంవాద్యముల
చారుతరంబుగ శృతులుగూర్చుకొని శార్ఙ్గపాణిచరితములు॥ యి॥
పాడుచుఁదాండవమాడుచుండుదురు భావరాగతాళముల
వీడక హృదయంబున నిల్పిరి సర్వేశ్వరునిపదాబ్జములు॥యి॥

వ॥ ఇవ్విధంబున ఆనందించి నరసింహదాసువారుచేయుచుండిన నృత్యగీత హరినామస్మరణలకత్యద్భుతంబు నొందినవారై దమమందిరంబునకుదోడ్తెచ్చి నిత్యకాలక్షేపములు జరుపుచుండు నెడ॥

హాయిరీరాగము - చాపుతాళము.

రామాయని మిమ్ముఁ బిలుచవియ్యానోరు- రాతిరోలనవలెను - మువ్వాటికి రాతిరోలనవలెను ॥ బ్రతికిన్నాళ్లు నీభజనఁజేయుట రామా - భవబంధవిమోచనము। అతిదయాపరుఁడనియాత్రగతుకుఁడనియానందపడవలెను వోరామా॥ రామాయని। కన్నులున్నందుకు ఘనమైన నీమూర్తిఁగనుగొంటి భాగ్యమున । వన్నెగథయము లేకున్నాకుంఠుఁడవని యున్నదే పార్థిమ శ్రీరామా॥ రామా॥ వాసిగభద్రాచలేశుఁడవని నిన్ను నాసనెటింగితి నిన్నాసించి నరసింహదాసుఁడనని నేదోసిలొగ్గి వేడితి॥ శ్రీరామ॥ రామాయని॥

మ॥ శ్రితమందారు వినూత్నరత్నవిలసత్సింహాసనాసీను భా। సితనీలోత్పలమేఘవర్ణుఁ గరుణాసింధున్ బ్రసన్నాననున్। నతవత్సున్ భువనైకనిత్యనిరతానంద స్వరూపున్ సురా। ర్చితు శ్రీరామధరాధినాథు మదిసేవింతున్నభీష్టాప్తికిన్॥

వ॥ ఇవ్విధంబునఁ దానును వరదరామదాసుగారును మూఁడుమాసంబులవరకుఁ గలసిమెలసి శ్రీరామభజనఁ జేయుచునుండి యొకదినంబున వరదరామదాసుగారిని జూచి శ్రీభద్రాచలంబునకు బోవుటకు సెలవొసంగుమని ప్రార్థించినఁ దానును రామదర్శనంబు నిమిత్తంబు వచ్చెదనని పల్కినందున సంతోషించి యందుకు వరదరామదాసుగారు తనతాలూకు లక్షయాభైవేల వరహా

ల ద్రవ్యమును దీసుకొని ప్రయాణోన్ముఖులై హరిభక్తులు మొదలగు వార లంజూచి యిట్లనుచున్నారు. ... ... ... *

ఆనంద భైరవి రాగము — ఆది తాళము.

భద్రాద్రికినిదుగో మేముపయనామయితిమి - రామభద్రుని సేవించు మార్గపదవిఁగంటిమి॥ భద్రాద్రి॥ వినయముతో భక్తులకువిన్నవించితి - మీరు చనుమనియాజ్ఞ సేయుటకుసంచలింపుచు॥ భద్రాద్రిక॥ ఎందుఁజూచినసుఖము యుంతైన లేదిగో-విందునిఁగొలచినఫలమెందుసరిరాదు॥ భద్రాద్రికి॥ చిన్న నాటనుండి ద్రోహములెన్నో చేసితి - నాపన్నరక్షకునిదలచియన్నిబాసితి॥ భద్రా॥ భద్రాద్రివాసుఁడేమనకుభారకుడంటి- నితరక్షుద్రదైవములదిక్కుఁ జూడననియుంటి॥ భద్రాద్రికి॥ సారసనేత్రిరో భక్తిమీరియుందాము తూము- నారసింహపోషకునిఁజేరకందాము॥భద్రాద్రికినిదుగో మేముపైనమయితిమి॥*

ఉ॥ శ్రీరఘురామమీప్రపదసేవయుభక్తినిరంతరంబు।మాకారయ నిష్టమైనవరమింతియెచాలునుమాటిమాటికిన్। గోరెదనీవరంబునినుఁగూరి చియన్యవరంబులెవ్వియుం। గోరనునాయభీష్ట మొనఁగూర్పఁగదే కరుణిం చిమకుఁవక్॥ ... ... ... ... *

నాటకురంజ రాగము — అట తాళము.

నీలనీరదగాత్ర - నీరేజదళనేత్ర - నెన్నఁడుగనుగొందునో॥ వా లాయముగవన - జాలమ్ములోఁజిక్కి - మేలెఱుంగకటవి - మృగమునైతిరి గితి - మేలిబంగరుచేలమునువ - జాలమకుటాంగదములునుము - త్యాల సరములులోనుగార - త్నాలచౌకట్లమరుచుండెడు॥ నీల॥ చుక్కలతోని- నెకసక్కెములాడు - చక్కనినెమ్మోముపై- చొక్కపుకస్తూరి- చుక్కబొ ట్టుఁదీర్చి - గ్రక్కునపదముల - గజ్జలందెలుమ్రోయ - మక్కువతో బ్రణ మిల్లుచునపెం - పెక్కునానందంబుమదిలోఁ బిక్కటిల్లఁగ జన్మఫలములు దక్కహృత్పద్మముననిరతము॥ నీల॥ కాంచనరత్నసం - ఘటితమంటపమున మించుపీఠంబునందు - పంచశరునిచేతి - బాణమొయనిదీ - పించభూమి జఁగూడి- వేంచేసెదీనులఁగాంచిసన్మానించివారల - వాంఛితములీడేర్చుటకు మో - దించిభవభయమెల్లమొదటికి - ద్రుంచివెఱవకుమనుచుఁబ్రోచెడు॥ నీల॥ మీరిభద్రాద్రివిహారుఁడైభక్తమం - దారుఁడైరఘువీరుఁడై - కోరిక లరతూము - నారసింహునియింట - భారకుడైయున్న - సారసనాభుని- నీరజంబులఁ బోలుపదముల - శ్రీరజఃపటలంబుఁగన్నుల - జేరిచియుద్ధన్యో హామనుచును - జింతలెల్లనుబాసిమదిలో॥నీలనీరదగాత్ర॥ ... ... *

తోహరా— అనఘమతులు సద్భక్తులు లోకవ్యాపారంబు రోసి-
యెనసి తీర్థయాత్రాతత్పరులై యేగెదమని కట్టిచేసి॥ఇ॥
సెలవొసంగుమని బంధుమిత్రులకు సమ్మతిగాఁ జెప్పుచును-
సలలితముగ భక్తులతోఁ గూడుక సాగించెఁ బ్రయాణమును॥ఇ॥
చన్నపట్టము విడచి యుత్తరాశాపథంబున నడచి-
యున్నతవనగిరులు నదులును నేత్రోత్సవంబుగాఁ గడచి॥ఇ॥
పోవుచుండ నరసింహదాసుఁడా పుణ్యదేశమహిమలను-
సావధానముగఁ జెప్పుచు హరిపదసారసములు దలచుచును॥ఇ॥

చ॥ నిరతము త్రోవ నేగుతఱి నెయ్యముతోడ మదగ్రచారివై । కరమను రక్తి శుద్ధతను గౌశలమొప్పఁగ లక్ష్మణుండవై । శరము శరాసనంబుఁ గవచంబును ఖడ్గముఁ దాల్చి ప్రోవవే । తరణికులాబ్ధిసోమ వరతారకనామ శ్రితావనాచ్యుతా॥ ... ... ... ... *

శంకరాభరణరాగము—ఆదితాళము.

నిన్నుజూచుభాగ్యము నాకన్నుల - కేన్నటికో రామ॥ సన్నుతామరప్రసన్న రాఘవ యాపన్నరక్షణ పంకజలోచన ॥ నిన్ను॥ యెందుఁ జూచినను సుందరమగు నీ చందమెనుచి - దోచుమందహాసముని బృందవికాసనసనందనాదిహృన్మందిరవాస ॥ నిన్నుఁజూచు ॥ వేరుచేసినను వేరుదిక్కిఁకను యెవరీమహిలోన- వారిజాక్ష వరవారణరక్షసురారిదనుజశిక్షకటాక్ష ॥ నిన్ను ॥ నారసింహాసత్కవిదాసావనభరణనాగరిపుహరణా - నారదాదిముని సేవింతచరణా నవరుచిరశుభకర భవతరణా॥ నిన్నుఁజూచుభాగ్యము॥ ... ... *

మ॥ అలనాఁడార్తిని బిల్వనాకభయమా యాకాశవాణీధ్వనిన్ । బలుకావాక్యము సత్యమా జయము సౌభాగ్యంబు నాదెట్టిదో । తెలియన్నేరక విన్నవించితిని యేతీరైన నన్బ్రోవుని । మఱలనీవే గతి కావవే దయను రామా యార్తరక్షామణీ॥ ... ... ... ... ... ... *

వ॥ ఈప్రకారంబుగఁ బోవుచు.

తోహరా— శ్రీమీరిన నెల్లూరిపురములోఁ జేరిరి సంతోషమున-
కామజనకుఁడగు రంగనికోవెలఁ గాంచిరపుడు ప్రేమమున॥ఇ॥
దేవాలయమున కేగియచ్చటను దేవదేవునకు మ్రొక్కి—
భావజజనకుని పైఁ గీర్తనలను బాడిరి భవములు దక్కి॥ఇ॥
అష్టోత్తరపూజావిధానములనమరఁగాను జేయించి-
నిష్టతోడఁ దీర్థముఁ దిరువమాలలు నింపుమీరఁగ గ్రహించి॥ఇ॥

నాటి రేయియచ్చోటనుండిమరునాడుదయంబున లేచి-
తాటకహరశారంగనాథయనిదలచుచు దారినినడచి॥ఇ॥
గురుతరమగుగుంటూరిలోనుదమగృహమునకుబ్బొంగుచును-
పరభక్తులతోఁజేరిరి తానునువరద రామదాసుఁడును॥ఇ॥
రామనామవ్యాపారముఁజేయుచురన్యముగానుభయులును-
రామునిప్రేమలాభమువిస్తారంబుగనార్జింపుచును॥ఇ॥
అనిశముహరికథఁజేయుచు నానందాబ్ధిలోను దేలుచును-
మునుపుఘనులుపడిచినమార్గంబున మోక్షమందఁగోరుచును॥ఇ॥
భద్రగిరికిఁబోవుటకై యిద్దరునైనమైరిమనసూని-
అద్రిజనుతుఁడగుసీతారాములనాత్మలలోనిల్పుకొని॥ఇ॥

సురటిరాగము—అటతాళము.

పయినమైయున్నాను శ్రీరాముల- పాదసన్నిధికి॥ పయినమైయున్నాను-పరమభాగవతుల-పాదాబ్జములుమనఃపద్మమందుఁగొల్చి॥ పయి॥ కామక్రోధాదులుఖండించిమనమున- రామనామామృత - రసముగ్రోలుచునేడు॥ పయి॥ ధరలోన శ్రీభద్రగిరి- రాఘవులయందు- గురినిల్పికుదురుగ- గురుకృపవశమున ॥ పయి॥ వాసిగాన తూము- నారసింహదాసుఁ-డనఁగ భవపాశములిషజిమ్మి వేవేగడ॥పయినమైయున్నాను॥ ... ... ... ... *

ధన్యాసిరాగము—ఆదితాళము.

భామామణులారమీరుపైనమైరారె - ప్రేమమీర భద్రశైలరాములఁజూతాము ॥ చాలఁగ గౌతమినదిస్నానమబ్బును - మేలైనప్రసాదములు మెకరవచ్చును॥ భామా॥ సురలుమెచ్చి-మూడఁగాగిన్నరులుమ్రోయఁగ - గురుతుగరాముఁడు పెండ్లికొడుకైనాడుగ॥ భామా ॥ చైత్రశుద్ధనవమినాడుచిత్రతరముగ-భూపుత్రికవివాహమునసౌమిత్రిగొల్వఁగ॥ భామా॥ కన్నులపండువుగానుగాంచవచ్చునే - మంచి - పొన్నలుపైనిండజల్లిపొగడావచ్చునే॥ భామా॥ కూరిమితో తూముతూమునారసింహుఁడె - వారకభద్రాద్రికేగువాఁడైనాడుగ॥భామామణులారమీరు॥ ... ... ... *

మ॥ జగముల్ సేయఁగఁబెంపఁజంపనొకఁడైసావిద్యఁడైతన్నౌగా ల్వగనప్పాయక సాధ్యుడైమది తలంపఁగ రాక సానందుడైఁ । తగునైమఁర్త్యతఁదాల్పిస్వీయమగుతత్వజ్ఞుండునయ్యొప్పున । జగదీశున్నిజబోధరూపురఘువంశశ్రేష్ఠుభావించెదన్॥ ... ... ... *

వ॥ అనిఇటులబయలుదేరి॥

తోహనా—పోవఁగదమతో గూడనభక్తులుపాలుపుమీరనడువగను-
త్రోవనుమంగళగిరిసైనృసింహదేవునిదర్శింపఁగను॥౩॥
అచటికేగినరసింహునిసన్నిధినచ్యుతంబులనుగాంచి-
సుచరితములఁకీర్తించిరిహరిపదసుందరములసేవించి॥౩॥
వెడలిపోయికృష్ణాతీరంబునవింతలన్నిఁగనగొనుచు-
నుడుగకతపములుచేయుచున్నవాజడదారులఁజూడగనుచు॥౩॥
నందువెడలితమవెంటవచ్చువారందరుగుమిఁగూడఁగను-
పొందుగభద్రాచలమార్గంబునఁబోవఁగడగిరందరును॥౫॥

వ॥ ఈప్రకారంబునఁబోవుచు మార్గంబునంగల వుప్పవేలూరు మొదలగుగ్రామంబులు దాటుచు శరభశార్దూలవరాహభల్లూక కపిమృగసంకులంబగు దండకారణ్యంబుఁజొచ్చి తీర్థయాత్రా తత్పరులగు పరుషజనంబులు దనతోడంగూడి రామనామస్మరణంబుఁజేయుచు నడుచుచుండెడు సమయంబుననొకదినంబుమధ్యాహ్నంబున నాయరణ్యంబున నెచ్చోట జలంబులుగానమింజేసి వేసంగికాలంబున తృష్ణిపాస పీడితులై యొడలెఱుఁగక బడలియుండెడు భక్తులను పరుషజనంబులనుజూచి పరితాపంబుగలవాఁడై శ్రీభద్రాచలరాములందలంచి యిట్లని స్తుతింపుచున్నారు యిట్లుస్తుతించుతరి నాశ్రితబాంధవుండగు రామదేవుండు వృద్ధబ్రాహ్మణరూపంబుతోఁ దమకట్టెదురనుండుపాదకంటిలోమహాతపస్వివలెజపంబుఁజేయుచుండంగాంచి రామదేవుండని తెలియక ప్రాకృతబ్రాహ్మణుండని తలంచి చేరంగని యిచట జలపూరితంబగు తటాకంబుగాంచితిరేని ఆనతిచ్చి యీదీనుల రక్షింపుఁడని ప్రార్థించిన భక్తునింగని ముఖంబునఁ జిరునగువంకురింపనల్లదే కమలాకరంబుగనుమని దనహస్తంబుచేఁ జూపించినంగాంచి వికసితవదనారవిందులై సంతోషంబునఁ బోవుచుండ నృసింహదాసుండు తిరిగిచూడ బ్రాహ్మణుండదృశ్యుండగుటవలనసాక్షాత్ శ్రీరామచంద్రులే యిటులదర్శనంబిచ్చిరని యెంచి యేమనుచున్నారు॥ ... ... ... ... ***

మారువరాగము—అటతాళము.

ఏమితోచదేమియుపాయమె-రామయ్యానా- కేమితోచదేమియుపాయమె ॥ స్వామినిను నేనుప్రేమఁబిలిచిన - నామొరాలించవేమిరామయ్య॥ యేమి॥ యెన్నటికినిన్నుఁగన్నులనుజూతు- పన్నగారాతిపాలనారామ॥ యే॥ చారువర్ణమేఘశ్యామసుందరాకార-యోరఘువీరాధీరా॥ యే॥ భద్రగిరిదా

మభద్రమునిజన-భద్రదాయక శ్రీయాద్రిజాతనుత॥ నేమి॥ సుజనమందార వరతూము-నారసింహదాసపోషణా॥ నేమితోచరేమి॥ * * * *

మధ్యమావతిరాగము— ఆదితాళము.

కలఁడోలేఁడో - శ్రీరాముడు॥ కలఁడోలేఁడో॥ కలఁడోలేఁడో నన్నుఁ- గన్న శ్రీరాముఁడు॥ కలఁడో॥ తడసివానలకును_జడసివేసటనొంది- కడువేడఁ- రన్నన్న- ఘనుఁడు రాఁడాయెను॥ కలఁడో॥ పుబ్బలిలో దారి-తప్పిబ్బునను జెంది బొబ్బఁబెట్టినఁగాని- గొబ్బున రాఁడాయె॥ కలఁడో॥ చూడు నేడునీ- తోడనే యుండున- న్నాఁడు నేఁడువాని-జాడలేదాయెను॥ కలఁడో॥ నిరతముభద్రాద్రి పురమున నెలకొన్న - శరణాగతత్రాణ- బిరుదాంకుఁడగు తండ్రి॥ కలఁడో॥ కరుణతో ధృతతూము - నరసింహదాసుని - అరసి రక్షించెడు - నలసీతాపతి నేఁడు॥ కలఁడో॥ * * * *

మ॥ ధరలో దొల్లిటివారు నేనుసహగా దైన్యంబునన్ వేఁడమున్। వెఱపేలంచు నునియ్యవే యభయముల్ నేఁడేమివింతాయెనా। శరణార్థిన్ దిగనాడరాదెఱుఁగవా సర్వేశ నీవిచ్చియే। మరినన్ వద్దనువారలెవ్వరికఁ రామా యాతనరక్షామణీ॥ * * * *

సురటిరాగము—ఆదితాళము.

ఇంత నెనరుగలిగిన దైవము లికనెవ్వరు ఓ రామా॥ వింతగదా బహు వేడుకతో నా చెంతనిలిచి భయమంత బాపితివి॥ యింత॥ పగలు రాత్రులును- బదిలముగా నీభక్తజనుల వెంట- తగిలియుందువనిధరలో పలమును - మిగులవింటి నేడిదేమిముఁగంటిని॥ యింత॥ దీనదయాళుఁడనివిన్నందుకుఁ దెలిసెగదా నేఁడూ- మానసమున నీమహిమ యెఱుంగని మత్తుఁడనను బహుమానించితివిక॥ యింత॥ వరభద్రాచలనిలయా భవభయహరణసదయహృదయా- పరమదయాకర పంకజాక్ష తూము నరసింహావన నారదాదినుత॥ యింత నెనరు॥ * *

తోహరా—చిటితాళముఁ దంబూర మృదంగముఁ జిటికెలు ఝల్లరవులును -
కటక కనకపాత్రల చేఁ గట్టిన ఖంజరీలు మొదలుగను॥ యి॥
వాద్యంబులు మ్రోయుచు సురమందున వనమాలెను మెరయఁగను-
చోద్యముగా మార్గమున జనులు యీసుముఖులఁ గనుగొనను॥ యి॥

వ॥ ఇట్లు భజల జేయుచు బోవుచుండ నా భద్రగిరినుండి వచ్చెటిజనంబులంగని యిట్లనుచున్నారు॥

ఎరుకులకాంభోధిరాగము— ఆదితాళము.

కుశలమా-భద్రాచలనిలయుఁడు॥ కుశలమా॥ కుశలమా రవి- కులశుభ

వార్తలు విశదముగానిచ- వేడ్కగన్నను॥ కుశ॥ కుశలమా రఘుకుల శేఖరునకు
వసుధాత్మజయగు వారిజనేత్రికి॥కుశ॥ ప్రేమరావణుని - ప్రియసుతు దునిమిన
స్వామికో విమలుఁడు సౌమిత్రియచటను ॥ కుశ ॥ వసధిదాటి రఘు - వరుసతిఁగ
నుగొని- పనివినివచ్చిన-పవమానాత్మజునకు ॥ కుశ ॥ భయముతో ద్వార - పా
లకులై సుర- చయముకెక్కు-వగు-జయవిజయులకు ॥ కుశ ॥ పరమభక్తిగల
భావజ్ఞులగు శ్రీ - వరునిస్వజనులగు వైష్ణవనివహము॥కుశ॥ అరసి రాత్రిపగలనక
యూడిగము - వరుసఁజేయు పరి-వారములకు నెల్ల॥ కుశ॥ జననమరణములు
సరకుగొనక హరి- గనుగొని ధన్యతఁగను నిజదాసులు ॥ కుశ ॥ చుట్టుకోవెలల
సొంపగు స్వాములు - ఘట్టుపై వెలసిన- ఘనులు నృసింహులు॥ కుశ॥ అందము
గాపురి- ముందర నెలకొను- సుందరమగు గోవిందరాజులకె ॥ కుశ ॥ భూజ
ములును వర- పుణ్యాగౌతమియు - రాజిల్లు నగరము రథగోపురమును॥కుశ॥ మే
లివ్వజనములు - మించు ఛత్రములు - చాలు భేరియును - సరసన వృషతులును॥
కుశ॥ ఘనతరమగుపరి - కరయుగ్రాణము - అనువగు రామకల్యాణమంటప
ము॥ కుశ ॥ తరముగానీసుం - దరము చేతబహు - విరివిగలుగు గోపురచక్రము
నకు॥కుశలమా॥పోకబత్తిమల్లె - పూఁబొదరిండ్లను - శ్రీకరమగు తులసీవనముల
కును॥కుశ॥ రంగుగ మైడిచె - రంగుప్రటముగల - అంగజనిభుఁడగు రంగనికిని బ
హు॥ కుశ॥ రామదాసు మధురామృతసారను - ప్రేమగ్రోలు శ్రీరామలింగున
కు॥ కుశలమా॥ మొనసి దాసులకు - మోక్షమిచ్చుటకు - దనరియున్న ద్వాదశి
మంటపమును॥కుశ॥స. పదలొసగెడు- స్వామిసీతయును- యింపొందెడు పవ
ళింపు గృహమునకె॥ కుశ॥ లీల భద్రగిరి నేలు రాఘవు- శాలార్థము కరి - చయ
హయములకును॥కుశ॥ తప్పక జనకజ - స్థానమునకు గడు - యొప్పగుచుండెడు
నూష్ణ జలములకు ॥ కుశలమా ॥ సారరహిత సంసార పయోనిధి మీరి దాటుటకు
మెలఁగు నావలును ॥ కుశ ॥ చేలగిత్తూము నరసింహదాసునకు - బలుప్రాపగు
శ్రీభద్రగిరీశుఁడు॥ కుశలమా॥ ౨౫॥ * * *

ముఖారి రాగము — ఆది తాళము.

రారా రఘునందన పిలిచినఁ బల్కవేర భక్తచందనా॥ రారానను గావ
వేరా యనిపిల్వ గారడమేల రకమలామనోహర ॥ రా ॥ సాకేతపురవాసనీ
కేల దయరాదు లోకువగా నెంచి వ్యాకులఁ బెట్టక ॥ రా ॥ వందనమిదు గోస
నందనార్చిత నీదు మందహాస మోము చందమఁ జూపరా ॥ రా ॥ బాగుబాగా
యనుబగవాఁడ నానీకు - నాగడముగఁ జూచి జాగేల చేసేవు ॥ రా ॥ మో
మాటేమియులేక మోమైనఁ జూపక బాములఁ బెట్టెద వేమొయోర్వజాల

రారా ॥ గరిమతోడుతతూమునరసింహదాసుని - మురువకబ్రోచేవరభద్రాద్రివాస॥ రారారఘునందనా॥ * * * *

వ॥ ఇవ్విధంబునభజనఁజేయుచుఁబోవుచుండఁగొంతమారంబునకు శ్రీరామాలయగోపురంబుదృగ్గోచరంబగుటం గాంచియిట్లు వర్ణించుచున్నారు.

ధన్యాసి రాగము—రూపక తాళము.

దర్శనమయెగో భద్రాచల - దర్శనమాయెగో ॥ దర్శనమాయెగో శ్రీహరికి మందిరమై సిరిగలిగి వెలసెడిగిరిస త్తముని యొక్క—॥ దర్శన॥ తళతళ త్తళలుది క్తటములఁబ్రసరింపలలితమైనకాంతిగలిగినగోపుర ॥ దర్శన ॥ పరమపతితులను పావనులుగఁజేయు - హరిమందిరముపై మెరయుచుండెడిచక్ర ॥ దర్శన ॥ ధరణిలోపల తూమునరసింహదాసుని - దొరయేలు శ్రీభద్రగిరి యుత్తమునియొక్క—॥ దర్శనమాయెగో ॥ * * *

ఉ ॥ కంటినదీతటంబుఁ బొడగంటిని భద్రనగాధి వాసముల్ । గంటినిలాతనూజనురుకాముకకమార్గణ శంఖచక్రముల్ । గంటిని మిన్ను లక్ష్మణునిఁగంటిఁగృతార్థుఁడనైతినోజగ । త్కంటకదైత్యనిదాళన దాశరథీకరుణాపయోనిధీ ॥ * * * *

వ ॥ ఇవ్విధంబునఁబోవుచు.

తోహరా—చేయుచుభజనముఁగూడిభక్తులతోశీఘ్రమె దారినినడచి-
పోయిచేరిరాభద్రగిరినినుప్పొంగుచునఘములనడచి॥ఇ॥
అందలికోటలుకొత్తడంబులునునావరించుగోడలును-
అందమయినమేడలుచెన్నొందెడునబ్బురమగువాడలను॥ఇ॥
శృంగారవనంబులుప్రాదోటలుచెంగల్వలకొలకులును-
బంగారుమయంబగుగోపురములుబాగుమీరుమఠములును॥ఇ॥
మెన్నరానిరథములుగుఱ్ఱంబులునేనుంగులుపశువులును-
వన్నెకెక్కు—భూసురులురాజులును వైశ్యవరులుశూద్రులును॥ఇ॥
సిరులచేతఁబెంపలరుభద్రగిరిశ్రీరాములసదనమును-
సురగ్నాధిపశరజన్ములకైననువశముగాదుపొగడఁగను॥ఇ॥
యీవిధమునసుండెడుక్షేత్రమునుగ నియిష్టజనులతోఁగూడి-
పావనముగగోదావరినదినిబాగుగజలకములాడి॥ఇ॥
పట్టుపుట్టములుగట్టుకతిరుమణిఁబొలుపుమీరధరియించి-
దిట్టముగాసద్భక్తులతోడనుదేవళముప్రవేశించి॥ఇ॥

శ్రీరాములసన్నిధిప్రదక్షిణముస్థిరమితితో జేయుచును-
గరుడ స్తంభము జేరి మ్రొక్కి-రిగములు గూడియుందురు॥ఇ॥ *

శ్లో॥వందే వరప్రదమహావరదానగర్వలంకాధినాథకులపర్వతనాశవజ్రం। తం రావణానుజమరుత్సుతభానుసూనం । దిక్పాలసోదరగణైః పరిసేవ్యమానం॥శ్లో॥అజ్ఞానగాఢతిమిరాపహమాదిమూర్తిం। మూరక్తచారునయనాంబుజమాదిబీజం । అంభోధిమధ్యవటపత్రశయానమాదిమధ్యాంతశూన్యమఖిలాస్పద రామచంద్రం॥శ్లో॥ సుధాసముద్రాంతవిరాజమానద్వీపేసితేచందనపాంజాతే।మహాసనేసన్నగతల్పమధ్యే । సిషణ్ణమీశేరఘువంశరత్నం॥ *

వ ॥ ఇవ్విధంబున ప్రార్థింపుచుం గోవెలలోఁ బ్రవేసించు సమయంబున రామకీర్తనంబులు పాడుచుండిరట యెటువలెను॥

పూర్ణచంద్రిక రాగము—చాపు తాళము.

ధన్యోహంబనగలైను-నేడుగదా-ధన్యోహంబనగలైను ॥ ధన్యోహంబనగల్గె-దశరథతనయుని - దర్శనమునభవ- తాపత్రయమువీడె॥ధన్యో॥ తీరైన హేమప్రాకారగోపురములు - చేరువగౌతమింపారుటగని నేడు॥ ధన్యో ॥ పరిషజనులనెల్ల ప్రార్థించి వారల పదరేణువులు మైని వెదజల్లుకొనుటచే ॥ ధన్యో॥ రామచంద్రుడు దివ్యరత్నపీఠమునందు - రాజీవాక్షినిగూడి- రంజిల్లుటలుగని॥ధన్యో॥కనుగొంటిభద్రాద్రి- ఘనమయినతోరణ- తృణగుల్మాదులచేత తేజరిల్లగగని॥ధన్యో॥ ధరణిలోనరసింహదాసుడనగ-వడుదగియుంటిననిమదిదగిలియుప్పొంగినే॥ధన్యోహంబన॥ * * *

బిలహరి రాగము—రూపక తాళము.

ఇటువంటి సేవకున-కెంతైనఁగలుగునా॥పటుతరమయిన రాఘవ-ప్రభుసన్నిధి నేగాక॥యిటు॥ తేటకస్తురినొసట-నీటుగులుకుచుండ - హాటకాంబరుడైన శ్రీ- హరిసభయందునేగాక॥ యిటు॥ ఆడుచునాద్యమున - బాడుచునెదుటను-, వేడుచునామది-గూడియుండుటెచాలు॥ యిటు॥ వాసిగభద్రశైల-వాసునిదాసాన-దాసుడౌనరసింహ-దాసావనునిఁగనకున్న॥ యిటు॥ *

మధ్యమావతిరాగ॥— ఆదితాళము.

నేడుగదానాజన్మసఫలముగ । నిన్నుజూడగంటి॥నీరజవాహవిహారా నేనివాడనువీడనుఓడననుటచే ॥ నేడు ॥ ఎందరెన్ని దెల్పిననువినకనునీసుందరమగుమూర్తి పొందుగ నామదిడిందుకొల్పి భవబంధమువిడ యానందము తోడుత॥ నే॥ భూసురులును ధరభూపతులును బహువాసిగగొల్వగనుభాసురమగు

తంపాసన నసింపాయిటగనిసురభామినులాడగ॥ నేము ॥ తిరుగఁబెండ్లి గమా రుడవై వరధారుణిసుతను కోరి జేరిమెచ్చి సి తలబ్రాలు పోయగను కోరిచూడ మీవా రమనుటచే॥ నేము ॥ వరభద్రాచలపురమునసీతావరుడవై గను వెలసి ధరణిలో ననీదాసులకును బహు సాక్షాత్కారముగ దయనేలుదువని ॥ నేము ॥ పరమదయాళు వనిమానువినునాపలుకులు నిజముసుమీ- వెరవకుమనీకరుణతో తూమునరసిం హదాసుని ననురమ్మనుటచే॥ నేముగదా॥

ఉ॥ అంతిపురంబునందు శరధాధిపుమంగల మంత్రనిధ్యమం । చెంత యుసాటలాడుతతి హేమమణీపదనూపురంబులా । క్రాంత తంబ ఘంటికలు రంజిలమోహిత రూపరేకయుక్ । వింతగజెన్నుమీఱు రఘువీరకుమారుని దా రుణెన్నదక్॥

ఆనంద భైరవిరాగము చాపుతాళము,

నాపాలిభాగ్యమేమందు- రఘు- నాథుడు గనుపించెనమ్మ ॥ పాపా ములెల్ల నుబాపె శ్రీరామల - రూపముకనులకు రూపముగనుపించె॥ నాపాలి॥ బొంగి బొంగి ముదుకు - తాం- బూరచిరతలు పూసినందుకు - తనకైన యెంత ధ్యానము పెట్టిన పరవ పోయికోనే మానందుకు॥ నాపాలి॥ మం చిసొమ్ములు దాల్చి - నవ - మన్మథరూపము - యెంచగలేరు గౌరీ శవాణీశులు- మంచివారలకెల్ల మంచివాడువాడు॥ నాపాలి ॥ వామాంకమున సీతయున్నది- రఘువరునెనబాయని యున్నది - సౌమిత్రి శరచాప సహితుడై యా రామస్వామికిసగ్రభాగమందై యున్నవాఁడు॥ నాపాలి ॥ సకలాంగముల బయలు తురికెను-రామ-స్వామిసన్నిధిసేసెదోంకెను- అకలంకమైనచేలలకు రాఘవుసా టి- కొంకకైనగల రంగు మోహమునుబిలిచేను॥ నాపాలి॥ మునిజనులకు సన్నిధా నము- రామ మూర్తి భద్రాద్రి స్థానము- జనలోకమున నారసింహదాసుడను పెనగిదొడ్డపేరుపెట్టుకొన్నందుకు॥ నాపాలిభాగ్య॥

మారువరాగము - అటతాళము.

రామనామ పంజరమెయిల్లాయెను రమణులార చూడరె॥ ప్రేమమీర రామదాసులందరు మాకుఁ బ్రియమైనబంధువర్గంబైరి నేటికి॥ రామ నామ॥ బ హుజన్మములకు నేపరమభక్తులపాద పంకజములు గొల్చుచు - బహుగతులను వారిబార్థించి కరుణకుపాత్రుడనై యుందుభాగ్యము నేటికి ॥ రామనామ ॥ గం గకృష్ణవేణికావేరి గౌతమిగాగలతీర్థములఁ బొంగిస్నానము జేయ బంగారము గకొంతరంగు కడివిజులకొసంగిన ఫలమేమొ॥ రామనామ ॥ వారణాద్రిప్రయా గభద్రాద్రియువాసిగ శ్రీరంగము - కోంసేవించిన కోవిదులకు - తూమునార

సింహదాసునని మ్రొక్కుచుండెదు॥ రామనామపంజరమెయ్యిల్లామెన॥

వ॥ ఈప్రకారంబునన్నృత్యగీతంబులు సలిపి పలువంబిక ప్రార్థించుచున్నారు.

శ్లో॥ శ్రీరామం శివచాపభంగనిపుణం సీతాంగనాభూషణం । సుత్రామాశ్రితపాదపద్మయుగళం సూర్యేందునేత్రోజ్జ్వలం । కర్పూరాంగవిలేపనం రఘువరం దివ్యం కారుణ్యపాథోనిధిం । వందేకల్పతరుప్రదేశవిలసత్సింహాసనాధిష్ఠితం॥

శ్లో॥ శ్రీరామం శితికంధరస్య ధనుషః భేదనాత్ప్రాపితం । సీతాంకాంచనసన్నిధాం పరిణతాం మాకల్పగతోజ్జ్వలాం । వామాంకోపరి జఙ్ఘయా నతముఖీం మాలోక్య దివ్యాసనే । శ్రీమద్భానుశశాంక కోటినివహో పాయాత్స హో రాఘవః॥

శ్లో॥ శ్రీరామం భువనైకసుందరం సుంధారాధరశ్యామలం । రాజీవాయతలోచనం రఘువరం రాకేందుబింబాననం । కోదండాది నిజాయుధాశ్రితభుజైర్భ్రాంతం పదేపత్మజా । శ్రీశం భక్తజనావనం రఘువరం శ్రీరామచంద్రం భజే॥

తో॥హరా— అంతనచటియర్చకులు గూంప దీపార్చనలొనరింపగను.

సంతసంబుగను సహస్రనామార్చన మొనర్చె క్రమముగను॥యి॥
తులసియు దీర్ఘమగు విరిమాలయు సంతోషిమ్మిరు ధరియించి-
జలజాక్షు కులజుండగు రాముని చరితంబులు మదినెంచి॥ యి॥
రాగతాళభేదంబులు లేని రసముగ పాడుచును-
బాగుగా నృత్యంబులు జేసి భక్తి తోడ నిద్దరును॥యి॥

ఆనందభైరవి రాగము- ఆదితాళము-

చెలియా శ్రీరామచంద్రుల సేవ చేతామా- మనకరుణదీన రాములతోడం గలసియుందామా ॥ చెలి॥ భక్తజనులతోడంగూడి పాడుచుందామా - యొక- యుక్తిలో నేము క్తికాంతయొప్పగందామా॥ చెలియా॥ అఘములన్నింబార జిహ్వాసుఖముంగందామా- వన-రఘుకులాబ్ధిసోము నిందు రారమ్మందామా॥ చెలి॥ సాధుజనవాసుడై చాటుచుందామా- జగ - న్నాథుండీతండని మదిలో నమ్మియుందామా॥ చెలి॥ భద్రాద్రి లేశుని పాదముంబట్టుకుందామా - కట్టి- భద్రముగ మదిలోపల బెట్టుకొందామా॥ చెలి॥ దాసవైరులతోంబొందంబాసియుందామా- మనము డాసి తూము నారసింహుని వాసిగందామా॥ చెలియా శ్రీరామచంద్రుల సేవం జేతామా॥

చ॥ జగములకాదిభూతమవు సర్వజగద్వలయాశ్రయుండవు । జగమవునీవ భూతచయ సంభరితుండవునయ్య వేఱెయొ । వ్వాంగనుపింతు నీవయునబాలకనా ప్రణనాఖ్యతోడంబ । ల్కగనగు మేటినీవభవలంపటమానసదూరపతీనా॥

ఆరభిరాగము - ఆదితాళము-

నమ్మిన నన్నీ నమ్మవలె రఘు నాయక నీతో మ। నెమ్మది నీవలెఁ బ్రోచే వా దొర లెవ్వరిక మరిలేరు యిమ్మని దాసుని గానను । బ్రహ్మాదివాదు । బ్రహ్మకొనియాడ నెల్లన బహు- నమ్మితిఁ తోడనుజిమ్మెడి దొరవని॥ నమ్మి॥ మించిన కేసితి దాసత్వము- కొంచమునకే నేడుయుంచుక నీకృపగలిగిన రక్షించుము యిదె చూడు- సంచిత ప్రారబ్ధంబు లెల్లను- కొంచపరచి చూడు మించియారు దాటి నవిమ్మటమ సింవరా- పవమునఁగుదువటయిక॥ నమ్మి॥ ముందు గామీ పాదాబ్జములందండి చూడఁగంటి- పొందుగ మీకథలే మదికానందమౌ తోవింటి - సుందర రాము లెగతి గానిమనసం దెల్పుచునుంటి- ఎందుగమా యింటికి రమ్మని వదిదనమున నివదయు సేతువు॥ న॥ ఆరమొగ భద్రాచలవంచారక - యిరవుగ నేసిమీరు- కలకాలము దాసుఁ బ్రోచుటకై- బిరుదు పూని సాగు - అరుదుగ నరసింహుని వెంటను దిరిగి తిరిగి వాగు - కరుణతో మా పాలిటి సీతావరుఁడవుగ వెలసిన రఘురామ॥ నమ్మిన నన్నీ నమ్మవలె॥

మధ్యమావతిరాగము- ఆదితాళము-

దయానిధే నను యేదిరామ। కుయ్యో మొఱలోగన నయ్యోని నదేమదయ్య- రామయ్యా నాకయ్యాలింపగదయ్య॥ దయానిధే। పూర్వకృతము చేసి రాశలను బడి వరాధము లెంగనిదు రాత్ముఁడనువో॥ దయానిధే। వృథాభి - మానుఁడతుఁ ధాతుఁడను బెన్నిధానమని సన్నిధానమె కోరితి॥ దయా॥ భవాత్మ నాశ్రిత భయాపహర సాంబశివార్చిత నారసింహ మనోస్వ॥ దయానిధే॥

మ॥ శరణాపన్నశరణ్య రాగదవె హేచ్ఛా నామనస్తాపము। న్నిగసింపన్నివినీకఁ గట్టుడగ చేసి వేగ తేయే మిముక్। శరణంబన్న విభీషణాదులమనస్తాపంబు వారించవే। మరినాకెవ్వరు నీవయా శరణు రామా యాగరక్షామణీ॥

సురటిరాగము - చాపుతాళము-

నీకు నాకు దంటలే శ్రీరామ- నిన్ను విడఁజిపోను లే ॥ నీకు నాకుదంటగాక యీ భువిలోన నేకులుగలరయితె నాకేమిపనియిక॥ నీకు నాకు॥ పతితుఁడ నేను పావనుడవీవు నాథుఁగవి నీవు నేనీకునతి కూమిక దాసుఁడ ॥ నీకు। శరణాగత త్రాణశపథ బిరుడవీవు శరణని వేడెడు చతురుఁడను నేను॥ నీకు। కారుణ్యనిధివీవు కీర్తించి స్తుతుఁడ నేను- భారకుడవు నీవు పాత్రుఁడ నేను॥ నీకు॥ ధాతవు నీవు దాసుఁడ నేను బ్రహ్మాదివరుఁడవీవు భీతాత్ముఁడ నేను॥ నీకు॥ కూర్మితో భక్తోద్ధారకుఁడవు నీవు, నారసింహుఁడను నామధేయుఁడ నేను॥ నీకు॥

శా। కస్తూరీతిలకాన నుండు మహితాకర్ణాంత నేత్రుండు దే। వస్త్రో

శ్లో॥ స్తనియోగపురా। నాకపురుయధాస్థమిఘృణాగుణజలధీ॥

తే॥ గీ॥ అవధరింపుము దేవ వరాహమూర్తి । సురగణంబులుఁ ద్రిపురసంహరుఁడజుండు । మరియుఁ బ్రహ్లాదనారదమౌనివరులు । గాచియున్నారు గొల్వకై కాంక్షఁ జేసి॥

క॥ శ్రీరామచంద్రజగదా । ధారా దివ్యావతార దాసశరణ్యా । కారుణ్యసాగరవిభుల। హరాగాభవ్య ప్రచార నిఖిల స్తుత్యా॥

ఉ॥ ఈ యఖిలప్రపంచమున కెవ్వఁ డఖండుఁడ వనిత్యువాచ్యయా। మాయయె యుంగమాతగ మనుష్య వేషము మానియావినా । రాయనమూర్తియై యను చగావలిగొల్వఁ నుంగ మెక్కవేం । చేయుము కాలయాపనము సేయఁగ నేల వహస్త్రయింపఁగన్॥

ఉ॥ అవ్యగమప్రత్యగ్వ ఖిలాత్ర యువా కు గమాద్యమార్యసు । స్తవ్య మందర్పుప త్వమెనీవై సృష్టిసాని । ద్రవ్యగుణాత్మ నిత్యమునఁ దాలుచు వేతనువై నరూపము । దివ్యశరీరమిందఱకు దేవకనుంగొన వేడ్కనయ్యెడిన్॥

సీ॥ గందు గాగంచల మి ముకుటంబు సంచుగాఁ గనలంకరించితే ప్పి । గుగుత్తుగా నెగుటన గోరిసుమంగంబుగా దుకయున్నాఁడు కంజనేత్ర । లె మ్మువేగను చంగనమ్ము పురాణము మంచిసొమ్ములెల్లను దాల్చుకొమ్ము ఫలమ। పస్తితోఁడ గ్గొమ్ము నీదైన లివేమ్మకంబుగనందుకొమ్మనిమ్మ । నమ్మియున్న భక్తజనములు సన్నుతింప। గట్టుపుట్టంబునై పిలుచుట్టుచుట్టి । వల్లెవాటుఁ కిరీటంబు హారయులుగల్లఁ। మృగరాజంబునై నెక్కతో యజాతు॥

ముఖారిరాగము- ఆదితాళము.

రాజకుమారవరాహు- రఘురామశ్రీరామవరాహు- రాజీవనేత్రవరాహు భక్తరాజీవమిత్ర వరాహు ॥ కాకుస్థతిలక వరాహు - నవకస్తూరి తిలకవరాహు- కందర్పజనకవరాహు - భక్తగాయముని గేయువరాహు ॥ ఇందువదన వరాహు। దశస్యందనందనవరాహు॥ భద్రాద్రినిలయవరాహు- రామభద్ర సురేశవరాహు రుద్రాద్రివిహితవరాహు - లోకక్షుద్రసంహారవరాహు ॥ నరసింహపోషవరాహు- జగన్నాథ మహాత్మ వరాహు - మహారాజకుమారవరాహు - రఘురామ శ్రీరామవరాహు।

సీ॥ ముక్తాతపత్రంబు మునుకొని మెఱయుంగ నుభయపార్శ్వములఁ జామరలుదనర । వీణెగానవిచిత్రవివిధవాద్యంబులు చెవులవందువులు గఁజవ్రలు గొల్వ। నజభవామరసనందాదులెల్లను వినుతిగావించి బహువరాకంచు దెల్ప।

గోష్పదాబ్దానికీ గుణము సారించుచుఁ జిత్రసంగతుల గతులఁ । జూపుచును
గళిక చూపుః సౌంఖ్యజగము । ఎల్ల మోహింపఁ జేయుచున్నల్ల మలర । స్వా
భౌముండు శ్రీరామచంద్రవిభుఁడు । సాధుహృత్స్వైరిణంబున స్వామి వెడలె॥

మధ్యమావతిరాగము - ఆదితాళము.

స్వారివెడలెను రాముఁడు॥ స్వా వెడలెను॥ రాముడు॥ సారసభవరుద్రా
మరులెల్లనుజేరికొల్వశృంగారముగ నిదె॥ స్వా॥ కనకకిరీటకాంతి మీఱ । ముంగు
రులుజార- కస్తూరితిలకమింపుగులుక । కనుగొనలనుకృపఁ ఘనముఁ జిలుకగ । ద
రిన చిఱునగవు సుధలు గులుకగ ॥ స్వా॥ కంబుకంఠమునందు వెంచి । కౌస్తుభమ
ణిముఖంబున । కాంతితోడమించి చెంగలుగ వెలుగ కుంతలంబునను మణిముత్తెంబులు
భూషణతతులు ఘణుఘణులనగ॥ స్వా॥ బంగారుచాయపటముతోఁడ । మేఘాంలప్రభలు
శృంగారముగ మేలమూడా । రంగుగ శ్రీపదరాజీవములు చెలంగగ బుధజనసంగము
వెదకుచు॥ స్వా॥ శరశాపములుయిరుకేల । గుఱుతూర దాల్చి ధరగా యుంధు
డై యుంచుమీర । దొరతనమంతె మగువునుఁడను సరస లక్ష్మణుఁడు సంతో
షింపగ॥ స్వా॥ భూరిమహిమ సౌంఖ్యమీర । భద్రాచలనివాసుడు వసముగంను జే
ర- నారసింహదాసావనదీక్షితుడని । కోరజనములచే కొల్వగను॥ స్వామి వెడలె
నురాముడు॥

తే॥ గీ॥ ఈవిధంబునస్వామి వేంచేయువేళ । సకలజనములు సంతోషసం
సంభ్రమములు । మనములందన వెనగొనపరలిన్స్వామి । రాకగోరుచును
డిరరమణతోఁడ॥

వ॥ అత్తఱి నరసింహదాసుడు-

తే॥ గీ॥ ధరణిలోనిజదాసులఁ తలఁపుకొలది । సరసబహురూపములు
దాల్చి సాధుజనుల । గురుతుచెడకుండఁ దొంచు కోపదుండు । పరమపురుషుం
డు హరిభక్తబాంధవుండు॥

ఉ॥ చాలవిశాలనేత్రములు చల్లనిచూపులు మందహాసమున్ । మేలిమిపిం
డ చేలమును నిండు కిరీటము హారవల్లికల్ । నీలపుజాంగముల్ మెఱయు నీదగు
భక్తికిమెచ్చి నేఁడిటన్ । బాలుడవైన నిన్ను హరి బాయక యుండు సుమీ
సుపుత్రకా॥

ఉ॥ కావున నీవు దేహఘనకాంతులఁ జేయకభక్తితోడుతన్ । శ్రీవిభుఁడైన
మాధవుని సేవలొనర్పుము ముక్తి గల్గునా । దేవుఁడు నీహృదాబ్జమున దివ్యముగా
వసియించు నమ్మికెన్ । పావనమైన బుద్ధినిస్వభావముగైకొనవయ్య పుత్రకా॥

సీ॥ మానికశ్యామాయమానసకేరుదీధితులచేఁ దిక్కులీనుకొనఁగ। గాంచనమేఖలాకాంతులతోడఁ గోకనదచ్ఛాయలు చెలిమిసేయ। లక్ష్మీసమాయుక్తలలితవక్షంబున వైజయంతీప్రభల్ వన్నెఁ జూప। హాటకరత్నకిరీటకోటి ప్రభల్ బాలార్కరుచులతో మేలమాడ। లలితనీలాలిరుచికుంతలము లుదనరఁ। బ్రవిమలాత్మీయదేహసత్ప్రభసరోజ। భవభవామరముఖ్యులప్రభలఁ జూపి నఖిలలోకైకగురుఁడు నారాయణుండు॥

చ॥ సలలితశంఖచక్రజలజాతగదాశరచాపఖడ్గవి। గ్రహలను చూలఁ సువర్ణరుచిరరత్నశోకంకణముద్రికాప్రభా। వళులొలుకంగ జాల్పి భుజగర్వసకలశోభాంతియుక్తమై। విలసితకృష్ణకారివృద్ధివినుహాసుఁ బురుణింపఁబట్టుగన్॥

క॥ సరసోదారసమంచిత। దరహాసవిలోకనము లదఁగలోకముఁ। బరితోషమానొందించుచుఁ। బరమోత్సవముల్పవిశ్వబంధుఁడగుచున్॥

చ॥ మరియును రాజహంసరుచిరధ్వజవీక్షిత తాళవృంతచా। మరవిరువంకలన్ దివిజనూనులీవసుధామరీచిపిస్ఫురితసితాతపత్రమహిపుంజముదిక్కులఁ బిక్కటిల్లఁగాఁ। గనవరమంటువర్చసుభగస్థితియొప్పసువర్ణయానుఁడై॥

కాంబోధి రాగము - ఆదితాళము,

చూడరేమిరో సుదతులార చూడరేమిరో। భావము వ్రి చూడరేమిరో। వేడుకలరరాముపభునియొయ్యారము। చూడ॥ స్వారివెడలి వ్యాళువేంచేసెను హోరికుంకుమ రసహారతులందిచ్చె॥ చూడ॥ కమలాముపై మంచిణముల వలె మించి శ్రమబిందుకణములు చాలమోము గ్రమ్మె॥ చూడ। తాళవృంతములను తరుణులందరుగూడి వేళ చల్లగాను విచుచుకొన్నారితి॥ చూడ॥ జాజుకురులు కస్తూరితిలకమును। తీరైనచూపులు జోకన్నులనిండా॥ చూడ॥ మీ భద్రాద్రివిహారుడు నేడిదె। నారసింహునిబ్రోవ నాథుఁడై వేంచేసె॥ చూడరేమిర॥

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

పూజసేయుచునుండరే- శ్రీరాముని॥ పూజసేయుచునుండరే। పూజసేయరే హృత్సరోజపీఠమునందు - రాజకుమారుఁడౌ - రఘుకులోత్తంసుని॥ పూజ॥ గంధపుష్పములచే- గడువేడ్కతో భవ- బంధవిమోచను। పదపద్మములయందు॥ పూజ॥ వరుమంజిముత్యాలసరములు మెడనిండధరియించి। సింతముగురిగామానసముని॥ పూజ॥ ధూపదీపములిచ్చి- గోపాలదేవుని బ్రాపేనమ్మితి మని- యోపికచేమిరు॥ పూజ॥ మంచిమిగడ పాలు - వంచదారయుఁ గూర్చి మించినభక్తిని। -చెంచిశ్రీరాముని॥ పూజ॥ భరితమౌభద్రాద్రిపురమ్మున నెలకొన్న- శరణాగతత్రాణ- బిరుదుగల్గినసామి॥ పూజ॥ హరిహరులకుదాసుఁడౌ

లమర-రాజాధిరాజమూ రాజవరాకంచు హెచ్చరించెటిభట్లు లిచ్చదనర । సం
గీతసాహిత్యసంసమ్మదూ కృలకనిజనవంశీమాగధులుపొగడ - భేరీమృదంగగం
భీరస్వనము మోయుచు సర్సగసలుగూడిం యాటలాడ । పసగవెయిస్తంబముల మంట
పంబులోన। కోటిసూర్యప్రకాశతకోమమునిమిగుల। కొలువుదీర్చినసినుజే-కొ
లువవలదె- రామగణగంభీరుభద్రాద్రిధామా॥

వ॥ అనిధ్యానింపుచుసభామధ్యంబుననవరత్నసింహాసనంబుపై కొలువు
దీరిన రాములంగాంచి॥ కాపిరాగము - అటతాళము,

దొరవలెగూర్చున్నాఁడు- భద్రగిరినధుడీఁడేమొచూడు । మేరువైనిచా
వంతిపిరుఁదండలుబాలమునిఘుమధరియించిముదిసీతనుఁగూడి॥ దొర॥ వుము
పంబిమత్యాలసరులుకెంపులతాళిమెరయుచునుండఁగ జిరునవ్వుమొగముతో॥
దొర॥ కాంచనచేలముఁగనకకిరీటములాంచనములుగలలక్ష్మణాగ్రజుడీదే॥దొర॥
విమలవస్త్రము ఁబగవభక్తులుగొల్వ- నరసింహదాసునింగసిపోచుటకు॥ దొ
రవలెగూర్చున్నాఁడు॥

గీ॥ అవనిజయునీవునొక్కసింహాసనముఁ। గమలబాంధవుగతదేహకాం
తులమర। నిపుడుకూర్చుండఁగనుఁగొంటిసఫలమయ్యె। జన్మనోరామయా
మిసిచరవరామ॥

కాంభోధిరాగము - అటతాళము-

అరుదైనరత్నసింహాసనమందుఁగొలువాయె శ్రీరఘురాముఁడు । మెరుపు
తోఁదగునీలమేఘునిసీతాసమేతుఁడై శ్రీకమిరెనేడు॥ అరు॥ సరిలేనిమాత్రికఛత్రం
బుభరతుఁడాసక్తితోడుత బట్టఁగ । వెరవొప్పలక్ష్మణుఁడువిల్లునమ్ములుదాల్చివె
నుకటిక్కునసిల్వఁగా । సరసశత్రుఘ్నుండుకరము లొయ్యనబాపి చామరంబులు
వీచఁగా। వరమభక్తుండైనపవమానసుతుఁడు శ్రీపాదాబుజము లొత్తఁగనే
డు॥ అరు॥ సారెసారెకువిభీషణుఁడు నాస్వామియెచ్చరికయనుచుఁదెలుపఁగా-
కోరిసుగ్రీవాదివీరవానరవరులుగొలువుసేయుచునుండగాఁ । జేరిమోదమునవ
సిష్ఠగాధేయులాశీర్వాదములుసేయఁగా । భూరిభేరిశంఖమొరయుకాహళధ్వ
నులుఘోరుకొల్పచుమ్రోవఁగానేఁడు॥ అరు॥ జిగిగులుకకమనీయశీల దివ్యాంగ
నలుశృంగారములుసేయఁగాపొగడందుమాణిక్యవేదికప్రభలుదిక్కులంజమురంజి
ల్లగా। సొగసైననునుమటఁగస్తూరికాతిలకంబునిగనిగనుప్రభలీనగా। నగణితం
బుగనయోధ్యానాయకుఁడుకోటికిమారితేజముసఁబొంగగానేఁడు॥ అరుదైన
రత్నసింహాసనమున॥

వ॥ ఇట్లంకంబున జూచుచు దేహేంద్రియ ప్రపంచంబులు మఱచి తన్మయత్వం బున మనస్సంబోధించి జేయుచు మానసపూజ గావింప నుపక్రమించినవారై॥

కాంభోధి రాగము - చాపు తాళము-

కట్టివేయఁగదరే శ్రీరాముల గట్టిగ మదిలోపలను। కట్టివేయ రెమ్మిద రట్టుగను గ యోగపట్టాభిషేకుని పట్టువదలకుండ॥ కట్టి॥ గుణయను స్తంభమున నభక్తియుని వెడుమును పెంపు ప్రత్రాటను- స్థిర మైహృత్పద్మ వరసదనములోన నాగులు నా కుండగఁ గరిమి శ్రీరాముని। కట్టి॥ చూడఁబోవ నావేద పెవానితో మాటలాడ శక్య ముగాదే। చేతికియుక్తైనజాడ వెదకినానితో ఁడెట్లు మీవాడ వలకుండ॥ కట్టి॥ పూరు పేరులేదు గామనలోనాత్మారాముఁడై పిలసిల్లగా- సారసాక్షుమన్న ధీ రుఁడై గోపిక - లారఁడిఁ జేసి చోరుఁడునీడబె॥ కట్టి॥ వాజాక్షి చూడవే యీ చిన్నయాకారుని గన నేరవే। వేరులేని తూము నారసింహునియుంట- భారకుఁడై యున్న సారసనాభుని॥ కట్టివేయఁగదరే॥

ముఖారి రాగము - అటతాళము-

పూజసేయఁ గదరే బంగరు పూల పూజసేయరే। పూజసేయరె రాజరాజత నూజనిరవికోటి తేజుని రాముని పదములు॥ పూజ॥ సారసగంధులు సారసములు దెచ్చి సారసాక్షుని పావనాంగ సనాలకును॥ పూజ॥ కుటిలకుంతిలఁ గన్నతో యజాద రునకు- నంటిన భక్తిగోర్కె నంటి పువ్వులు దెచ్చి॥ పూజ॥ వింతగాను సేమంతిపువ్వు లు శ్రీమంతుఁడైన లక్ష్మీకాంతుని పదమ్ములు॥ పూజ॥ జలజాక్షులందరు జలధర దేహు నిసలలితముగ లక్ష్మీ తులసిదళములను॥ పూజ॥ వాసిగ భద్రాద్రివాసుఁడు నరసిం హదాసుని హృదయనివాసుఁడై యున్నాఁడు॥ పూజసేయరే॥

కాంభోధి రాగము - అటతాళము-

చల్లరె రాముని పైన పూలు చల్లరే॥ చల్లరే విరజాజులు లాజులు మల్లెలు మొ ల్లలు మాంచి సంపెంగలు॥ చల్లరె॥ సీతాసమేతుని ఖ్యాతిని నుతిఁ జేసి ప్రీతితో డఁ బారి జాతకుసుమములు॥ చల్లరె॥ సలలితముగ భక్తి చాలా దీపింపఁగ మొలకవన్నెలు గల తులసిదళములు పైన॥ చల్లరె॥ నీరుగన్నేరు పన్నీరు తీసి వకుళ సారసదవన బంగారు పుష్పములు॥ చల్లరె॥ వాసిగ నరసింహదాసుని హృదయనివాసుఁడౌ శ్రీశ్రీనివా సునిపై బూలు॥ చల్లరె రామునిపైన పూలు చల్లరే॥

ఉ॥ ఘనుఁడగు రామచంద్రుని పదకంజము లే మదినిల్పి వేడుకన్। జనకజఁ బూ జచేసి మఱి జారుతరంబుగ నాంజనేయునిన్। వినయము చేనుతించి పరవీరభయం కరుఁడైన లక్ష్మణున్। బ్రణుతియొనర్చి యెల్లపుడు బ్రార్థన చేసెద నిష్టసిద్ధికిన్॥

నీరాంజన హారతి-

కర్పూరహారతులివ్వరే. శ్రీరాములకు ॥ కర్పూరహారతులివ్వరె స్వామి రంగమీరలోకపుతోడుతఁ గందర్పునిఁ గన్నతండ్రికి ॥ కర్పూర ॥ పున్నమచంద్రుని గేరుచున్నదగు మోముచాఁ గన్నుల గాంచి మిగుల సన్నుతులెసఁగ జేసి ॥ కర్పూర ॥ పూని భుజంగరాజుకైనఁ బొగడంగరాని - వానియాదరకపు(?)- ధ్యానించి శ్రీపాదములకు ॥ కర్పూర ॥ పంకజముఖులు కరపంకజములుసాచి - పంకజనాభుని మ్రోలసంకీర్తనములుచేసి ॥ కర్పూర ॥ కోరి సేవింపువారికిఁ గోరికలిచ్చి ప్రోచు- ధీరుఁడైనట్టిరఘువీరునకిపుడుమిరు ॥ కర్పూర ॥ మీరు భద్రాచలపిపత్తునకై నేడు తూము- నారసింహదాసుఁ డాజేరి ప్రోచెడిస్వామికి- కర్పూర ॥ హార ॥

వ ॥ హారతులిచ్చి తదనంతరంబిట్లనివిన్నవించిరి-

జులిమూతాళము - ఘుర్జరిరాగము- పూర్ణచంద్రిక-

అవధరింపుమిరామ- అవధరింపుమీ ॥ ఆవలీవరచామరములు- సేవకజనులేయుచున్నా- రవధరింపుమీ ॥ రజితదండధారులిదె పరాకుచెల్పుచున్నవారల వధరింపుమీ ॥ వీణెగానరవము సేయుచువిబుధులెదుటనిలచియున్నా రవధరింపుమీ ॥ నిన్నుగొలుచువేడ్క జనములున్నవార లెదుటనిలచి ॥ యవధరింపుమీ ॥ భద్రనగసుధామరామభద్రనీరదశ్యామ ॥ అవధరింపుమీ ॥ అసతోడనారసింహదాసుఁడేపుడుగొలుచుచున్నా ॥ డవధరింపుమీరామ ॥

సౌరాష్ట్రరాగము - చూర్ణిక-

శ్రీమత్సమస్త భూపాలజాల సుందరీ సదోహ సుందరనిటల సమగ్ర కుంకుమస్ఫుటపిలతులక్షణచరణారవిందమయిధిలిశాతకుంభకుంభకుచకుంభసంభరితమృగిమదసార ఘనసార కాశ్మీరచందనపటీరకర్దమాంకితవక్షప్రదేశం సుప్రకాశం- వేదండతుండాయమానదోర్దండఖండమండితశౌర్య మహోద్దండ సంధానకాండపాండిత్య దండనకృత భండనరిపుమండలం గండస్థలప్రతిబింబిత నక్రకుండలం- తగ్రరత్నచామీకరయుతమకుటకటకాంగుళియ్యాక మంజీరహారకేయూరముఖభూషణకిరణధగద్ధగాయమాన కోటికోట్యర్కప్రభేకృత చరణవిరాజితం-ధవజార్చితం- సమస్తమునిజనహృత్కమలకర్ణికాంతర వసంతం-చంద్రాననవిరాజితం- ఖరాసురవిరాధ దశకంధరముఖ్యనిశీధిసీచరనిఖరరణరంగ విదారణకారణనివార్యశౌర్యధైర్యం- సాగరసమానగాంభీర్యం- సకలజగజ్జన సంస్తూయమాన తారకనామమహామంత్రరాజస్వరూపం - వరగుణకలాపం- ధరహిమధరశత తారతారకానికరనీహారహారహీరడిండీరఘనసారమరాళపటీరవిరాజత్కీర్తిహారిహాస ఐరావణశరకుసుమవిసశరత్సముదధరాధరహలధర

శారదనారదపుండరీకకుండలీశ పాండురరుచిరసనయశో విశాలదశదిశభాగం మహిమాన్వితభోగం - శుకసనకసనందనసనత్కుమారసనత్సుజాతనారదకశ్యపవిశ్వామిత్రపరాశరవ్యాసశౌనకవసిష్ఠవాల్మీకభివప్రముఖఋషిస్తవచరిత్రం మహేంద్రనీలోత్పలనిభగాత్రం - వివిధరుచిరఘనమందిరకుడ్యోపరిభాగవిరచితనానావర్ణమంజులతరసాలభంజికాపుంజరంజితవిచిత్రనూతన రంభాస్తంభాయమానచతుర్ద్వారమరకతమణి బంధతోరణమాలికాలంకృతసభామంటపప్రదేశగారుడోపలపుష్యరాగఖచితసింహాసనాసీనం- కౌస్తుభభద్రాయమానం శ్రీమత్సీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సుగ్రీవ విభీషణాంగద జాంబవత్ప్రముఖసపరివారసమేతపట్టాభిరామచంద్రదేవం। దేవాదిదేవం - సమస్తరాజాధిరాజకోటీరఘటితమణి రాజరాజినీకృతవిరాజితపదరాజీవం - కరుణారసస్వభావం అనూనగానవేణువీణానినాదమృదంగతాళనృత్యవాద్య వైఖరీ వినోదతూమునృసింహదాసాభిధాన విరచితగద్య పద్యాదివద్యా విద్యాపరతప్యార్యం- వేదాంతవేద్యం- మముకులదైవతం-మమజనకం- మమభుక్తిముక్తిప్రదం- శ్రీభద్రాచలధామం- నిరంతరం- అహం నమస్కరోమి-

పంచచామరం-

హరామరేశసారసోద్భవాదులెల్ల నిన్ననీ చరాచరేశ్వరుండవంచుసంస్మరించిధన్యులై - విరాజమానులైరి యారపిశ్వరూప శ్రీహరీ - వరాకుభద్రశైలరామభక్తకల్పకద్రుమా- వరాప్సరేశముఖప్రశంసితప్రభంజనప్రభంజనా-పరాశ్రితాళిపంకజప్రభాకరప్రభాకరా- శరాసనాదిభీషణాలసద్గుణాల సద్గుణా-వరాకుభద్రశైలరామభక్తకల్పకద్రుమా-ధరాసుతామనోహరాసుధాకరోపమానసా- ఖరాసురారివైరిబృందఖండితప్రతాపవి - స్ఫురద్విభాజాంగజాతకోటిసుందరాంగశ్రీకరా - వరాకుభద్రశైలరామభక్తకల్పకద్రుమా- హిరణ్యధారుణేంద్రధీరహారహీరసీతభూ - ధరామరావగాలసత్సుధాసుధారకాబ్జభా- స్వరాంతరంగకాంతిహాసచారుకీర్తిసంయుతా - వరాకుభద్రశైలరామభక్తకల్పకద్రుమా- సరోజనేత్రపంచపంచచామరాఖ్యమాల్ రచించి। రత్నకంఠహారమేనుచెన్నుగానొసంగితిన్ । పరిగ్రహింపుమోరమేశభక్తపాలనాచ్యుతా- వరాకుభద్రశైలరామభక్తకల్పకద్రుమా॥

కేదారగౌళరాగము - రూపకతాళము-

శ్రీమానసనవకైరవసోమా రిపుభీమా - రామా శ్రీభద్రాచలధామా హేచ్ఛరక - నారాయణమధుసూదన నీరేజనాభ నారదనుత శ్రీపద్మనాభహే

త్సరిక॥ ధరణీవరకరుణాకరవరమునిజనపోషాసురవందితచరణా భవతరణా హెచ్చరిక॥ కనకాంబరపరిమణిమయకాంచనసద్భూషా। జనకరవంశాంబుధి యోషధీశా హెచ్చరిక॥ కుండలమణిమండితగండస్థలశోభా। చండదనుజఖండన వేదండా హెచ్చరిక॥ ధీరమహోదారయిలోద్ధారణయశస్సార- భూరిదయా పూరారఘువీరా హెచ్చరిక॥ రామఘనశ్యామబుధస్తోమజనకామా- సామజవ రదాసురసుతనామా హెచ్చరిక। భూమిసుతాసహితానన్నామింకపిగావహా శ్రీమదయోధ్యామంజులరామా హెచ్చరిక। అంభోరుహకుంభోద్భవసంభావి తచరణాంజంభాంతకమణిసదృశశ్యామా హెచ్చరిక॥ భీషణఖరదూషణమదశో షణనిజవేషా- ప్రాంపాస్వయభూషణమణిభూషణా హెచ్చరిక॥ కుటిలాలకశో భితఘననిటలాకుటిలతటలా- చటులాసురపటలాంతకజయజయ హెచ్చరిక॥ సని మానసపద్మసముహశోభనదినకరరూపా। వనజాయతలోచనరఘువల్లభ హెచ్చ రిక॥ శ్రీయుతనుతవాయుసుతామేయబలోపాయ- సాయకరఘునాయకఫల దాయక హెచ్చరిక॥ మనువంశాంబుధిసోమసగనుసిజనపరిపాలా- దనుజాంత కనరసింహావనచల హెచ్చరిక- శ్రీమానసనవకైరవసోమా॥ సీ॥ శ్రీకరాకారల క్ష్మీమనోజ్ఞవిహారప్రవిమలసువిచారబహుపరాకు। గౌతమీసతిశాపకలుషవి మోచనాపవనజహిత రామబహుపరాకు। కౌసల్యానందనఖగపతిస్యందనపవ నజహిత రామబహుపరాకు। అగణితమణిమయహాటకభూషణభపభయశో షణబహుపరాకు। భవ్యసుందరనృపవేషబహురాకు। భాగవతదివ్యసంసేవ్య బహుపరాకు। భద్రశైలోపరిస్థితబహుపరాకు। భక్తమందారరఘువీరబహుప రాకు॥ సీ॥ పలుమరువేడినఁబలుకకున్నావేమిపతితపావననామబహుపరాకు। సన్నుతించినవినకున్నావుమేలౌనెపన్నగాధిపతల్పబహుపరాకు। దేవాదిదేవ ప్రభావభాస్కరతేజపావనాంఘ్రిసరోజబహుపరాకు। బరునిగాఁజూచినఁ బరులెవ్వరికదిక్కు-పరమదయానిధేబహుపరాకు। పంకజాసనవందితబహుప రాకు। భావభవకోటిలావణ్యబహుపరాకు। భద్రశైలోపరిస్థితబహుపరాకు। భక్తమందారరఘువీరబహుపరాకు॥ సీ॥ జనకజాధిపరామచంద్రమహాప్రభోప వనజహితరామబహుపరాకు। నీలమేఘశ్యామనిజజనావనకామపవనజహిత రామబహుపరాకు। దశరథనందనదశకంఠమర్దనపవనజహితరామబహుపరా కు। సాకేతపురవాససదమలమృదుభాషపవనజహితబహుపరాకు। బాలశశిఖం డధరనుతబహుపరాకు। ఫాలలోచనసతిహితబహుపరాకు। భద్రశైలోపరిస్థిత బహుపరాకు। భక్తమందారరఘువీరబహుపరాకు॥ సీ॥ మాటలసందడిమమ్మేమ రిస్తివేమొపదిలమో సెహా రామబహుపరాకు। దీనజత్రాణదీక్షనుమరచితోప

విలమో హోరామబహుపరాకు। నీదాసజనులకు నే సేవకుఁడఁగానఁబదిలమో హోరామబహుపరాకు। అమ్మలేకనుఁజూచుకొమ్మునీసామ్మిదిపదిలమోహో రామబహుపరాకు। పరులకొప్పింపకుమి రామబహుపరాకు। పౌరుషమునీదెసుమీ రామబహుపరాకు। భద్రశైలోపరిస్థితబహుపరాకు। భక్తమందారరఘువీరబహుపరాకు॥ సీ॥ అర్థికిచ్చినవరంబవు దేవర చెదపట పదిలమో హోరామబహుపరాకు। అపకారము సరించునతనిమరి చెదపట బదిలమో హోరామబహుపరాకు। మరుమటునీకెవిమగసహజంబట పదిలమోహో రామబహుపరాకు। మరినన్నునీగతిమఱచెదవేమో కాపడిలమోహోరామబహుపరాకు। పంకజాక్షురమాధీశబహుపరాకు। భవ్యనరసింహపోషకాబహుపరాకు।భద్రశైలోపరిస్థితబహుపరాకు। భక్తమందారరఘువీరబహుపరాకు।పంచనామరం॥చరాచరాత్మకప్రపంచనాథునీధునీజుఁడౌ।విరించినైనసభక్తజాలవేద్యమైతనర్చునీ।విరాజమానసత్పదంబువేడఁజూడఁజాలఁదో హరీ।నమస్కరింతునన్నునాదరించికావవే। కరంబులందుశంఖచక్రకాగ్ర్యకాంతిశోభనల్।పరంబుగామెరుంగుటీనచేజరిల్లఁగోరియా। కరీంద్రుఁడఁబ్రోచినట్టినిన్నుఁగానఁగోరినాఁడనో।హరీనమస్కరింతునన్నునాదరించికావవే।దురంతసంసృతీసుహోద్రదూషమానితాత్ముఁడై।సరుల్పమండవంచునిన్నునమ్మిగొల్వఁజాలఁగి।మయింగెంతింగినాఁడనింకమూఁడుసల్కనేరనో।హరీనమస్కరింతునన్నునాదరించికావవే।కురుక్షితీశుఁడల్లనాడుకోకలన్వదల్పనో। చరాచరేశకాఫమంచునన్నుతింపనంతనీ।వెఱింగిద్రౌపదీమనోగతేష్టసిద్ధిఁజేసితౌ।హరీనమస్కరింతునన్నునాదరించికావవే॥సీ॥ మంగళంబిదెనీదుమందహాసమునకు మంగళంబిదెనీదుమకుటమునకు। మంగళంబిదెకుటిలాలకశ్రేణికిమంగళంబిదెకుందరదనములకు। మంగళంబిదెమృగమదరేఖకునుదివ్యమంగళంబిదెకృపాపాంగములకు। మంగళంబిదెనీదుమణికుండలములకునుమంగళంమణిమయాభరణములకు।మంగళంబిదెకోదండమహిమములకు।మంగళంబిదెకిసలయపాదములకు।మంగళంబిదెనీదునామంబునకును।భద్రగిరివాసమాంపాహిపాహిరామా॥

## ఏకాంత సేవా ప్రకరణము.

సీ॥ శ్రీమంతుఁడైనిజాశ్రితులఁబాలింపంగఁబరగదశరథుకూర్మిపట్టియగుచు।మౌనియాగముఁగాచిమహిసాంబశివువిల్లుఖండించిజానకిఁగడుముదమున।జేకొనిజనకునిచిత్తానుసారియైకాననంబునకేగిఖరుడుమొదలు।గాఁగలదనుజులఁగడువేడ్కఁద్రోడుతఁగడఁగిరావణుకుంభకర్ణుఁగూల్చి। కీర్తికాంతనుబొంది

సాకేతపురికి। శీఘ్రముగవచ్చి నట్టాశ్రితుండగుచు। బెద్దవడపనభాస్కరప్రతిని
లిచి। కొలువుఁ జాలించి రఘుపుంగవుండు పవళించెను॥ శంకరాభరణరాగము-అటతాళము

పవళింపవేంచేయు సమయము రామ॥ ప॥ పసిఁడి పాన్పుకలూని పడతి సీతకే
లూని॥ప॥ రసికజనులుగొల్వ రత్నపాన్పుకలూనివసియింపవేంచేయు సమయ
ము॥ప॥ ముసిముసినగవుల మోహనాకారుఁడై ముదమున వేంచేయు సమయము॥
ప॥ దశరథాత్మజుఁ డిదె దయతోడ నరసింహదాసుని ప్రార్థనవద్దయుఁ గైకొని॥ప॥

సీ॥ పుష్పరాగములకుఁ బుట్టినిల్లై నెలరాలకుఁ గూడల మెరుఁగు। మహా
తపస్వినమ్ములమణి గెలుగొని గెలు కెంపులగుంపువాకేండ్లసొంపు। నలుపటిష్ఠం
బుల మెలుపులుఁ తళుకులు పెత్తపచ్చఁడాలుతో రణపుచాలు। సిరిపిసము గ్రక్కలనక్కలు
ముగ్గులుమగ రాల మెచ్చు మేల్ జగతి మెచ్చు। తళుకుబంగారునిరుగ్రాములతీరు
లలితసేలపుమించు జాలములసంచు। గరిగయిఁ గనమితేన్నంగా రకలి। నైనన గ
రంబునకు రాముఁడరిగెయుచట॥చ॥ చేలవముగులుల-పొందగులుకుఁ జెందిన కొలు
లసొంపునింపుని। గ్గులుగల కెంపుగుంపుజతఁగూర్చినపట్టెలఁబట్టుపట్టెడల్। వల
గొనుమన్నుపాన్పుపయి వైఖరి నైరణి మేస్త్రితలగడల్। బలుచెలువొందినుండమ
గుపందిలిమంచము నైనిబొందుగన్॥క॥ శ్రీసీతామణితోడుత। భాసురగతుఁగ నేడు
శేషపర్యంకమునం। దాసీనుఁడగుట కైవి। శ్చేసెడుసమయము నెడయేకచిత్తము
తోడన్॥క॥ కరములు మొగుడ్చినుడుటను। గరసద్గిఘటించి మ్రొక్కి-కంజాక్షహరీ
వరదపరమేశయంచును। స్థిరతంబుఁబరాకుఁ దెల్పనిల్వఁగవలయున్॥

శ్రీరాగము—అటతాళము.

పవళించవయ్యా-రామయ్యా-పవళింపవయ్యా॥ పవళింపుమీ శేషపర్యంక
మందునకవగూడి సేవకగణములుగొల్వగ॥పవ॥ సొంపైనయుపిదలగుంపులపీ
ఠవాయింపులాలింపుచునింపొందుసతిగూడి॥పవ॥ చిలుకలకొలుకులపలుకుతి
య్యానిముద్దుపలుకులాలింపుచుపణతిసీతనుగూడి॥పవ॥ తిరముగసాకేతపురము
న నెలకొనినరసింహదాసునియరసిప్రోచెడుస్వామి॥పవళింపవయ్యా॥

శ్రీరాగము _ అటతాళము - చాపు.

పవళించెనమ్మా శ్రీరాములు- పవళించెనమ్మా॥పవళించినాడమ్మ పన్నగాధి
పుపైని-పంకజనాభుడుపణతిసీతనుగూడి॥పవ॥ముంగురులునుజారముసిముసిన
గవులముచ్చటలాడుచు-ముద్దులమాతండ్రి॥పవ॥ తళుకుకస్తురిబొట్టుకులుకుచు
నుండగ-దాసులహృదయనివాసుఁడైనేడిదె॥పవ॥వాసిగభద్రాద్రివాసునిసన్ని
ధిదాసవరద రామదాసుడుగొల్వగ॥పవ॥ గీ॥ ఇంచుకయుసద్దువలఁదికనిచట
నుడం। నమ్మలగువారుభయభక్తులతిశయముగ। దివ్యమంగళవిగ్రహుఁడు దేవదేవు।

నిత్యకల్యాణుఁడైనదిసిప్పిమదిరయు॥సీ॥అని యీవిధంబున ననఘు రాముఁ నుతించి మెల్లి మెల్లన పిలిచేసి టపలయుఁ దడయక రాగయుక్తంబుగాఁ గవ గూడి భక్తితో జోలలు బాడవలయు।సర్వకర్మ్ములఁ జామరల్ఁ ధరియించి వేడ్కతో జల్లఁగా వీవవలయు।సత్తనుపర్వ్నిరునను వైనసుమమాలు చక్కఁగాఁ బాన్పుపై జల్లవలయు।పసిఁడి డోలికఁ జేతులబట్టియూఁచి।స్వాంతమునను పచారముల్ సలుపవలయు। సీవిధంబున హరి సేవ లెవ్వరేని।సల్పు విబుధులు వైకుంఠసదనగతులు॥ సీ॥శ్రీరమాణితోడఁ జెలఁగి క్రీడ యొనర్చి మదనారిసన్నుత నిదురఁబోవె। దనుజులతోడ ననవడయక పోరాడి కదిసి ద్రుంచిన రామ నిదురఁబోవె। లేఁడి వెంబడి చాల మోఁదిచేఁ బను గత్తి వెదకియలసితివింక నిదురబోవె। తమ్ముని యాలిని దాఁగొన్న యావాలిమదమడంచిన రామ నిదురఁబోవె।ముదముతోఁ బూలపాన్పుపై సుదతిఁ గూడి।మదనజనక క్ష్మాపాలోల నిదురఁబోవె।విదళితాఖిలఖల రామ నిదురఁబోవె।నిదురఁబో భద్రగిరిధామ నిదురఁబోవె॥సీ॥జలచరాకృతిఁ బూని చలము చేసోమకు విదళించుటలు మాని నిదురఁబోవె।కూర్మమై గిరి యెత్తఁగోరిన పరమాత్మ కుదురుగా శయనించి నిదురఁబోవె।కిటిరూపమునఁ దరఁ గ్రించ నాగగ నేల యెదనిమ్మళించుక నిదురఁబోవె। మనుజపంచాననంబున దనుజుని బట్టి పొదలి ద్రుంచిన సామి నిదురఁబోవె। వదలక యవామనాకృతివైన నీవు। మొదలగల రామ బలరామ నిదురఁబోవె।సదమలాత్మక రఘురామ నిదురబోవె।నిదురఁబో భద్రగిరిధామ నిదురఁబోవె॥సీ॥ ఇలబుద్ధరూపు చేఁబలు పతివ్రతలను జెదరఁ జేసిన సామి నిదురఁబోవె।కలికిరూపము దాల్చి ఖలుల ద్రుంచిన దేవ మదినిల్పి నిమిషంబు నిదురఁబోవె। లోకంబులెల్లను నీ కుక్షి నున్న విపదిలంబుగా సుంత నిదురఁబోవె। నరసింహదాసుఁ డేమరక నీపదములు వదలకున్నాఁ డింక నిదురఁబోవె।మదవతుల యాటపాటల ముదమునొంది।చిదచిదాత్మక రఘురామ నిదురఁబోవె।యుదయభాస్కరనిభ తేజ నిదురఁబోవె।నిదురబో భద్రగిరిధామ నిదురబోవె॥

ముఖారిరాగము - అటతాళము.

నిద్దురఁబుచ్చరే శ్రీరాముని నిద్దురబుచ్చరే॥ నిద్దురబుచ్చరే ముద్దియలందరు వద్దికతోఁ జేరి ముద్దుల రాముని॥ ని॥ మేలిమి యగునట్టి డోలికయందుంచి నీలనీరదవర్ణు జోలాలు పాడుచు॥ని॥ వాటముగా మంచి బోటులు చేవీణె మీటుచు మేలెంచి పాటలు పాడుచు॥ని॥పంకజనేత్రుని సంకీర్తనలు మీరంకించి పాడుచుఁ బంకజముఖులార॥ని॥తీరుగ భద్రాద్రి చేరువ గౌతమీతీరమున నున్న యిరవార వెలయువాని॥ని॥ వేరుసేయక తూము నారసింహుని బ్రోవ భారకుఁడౌ రఘువీరుని నేడిదె॥ నిద్దురబు॥

జోలపాట—నవరోజు రాగము.

జోజో ఘూత్తంస జో పద్మనాభా జో మైథిలీనాథ జో రామచంద్రా ॥ జోల

క్షుణాగ్రజజో కామజనక-జోభక్తవత్సలజో శేషతల్ప॥జో॥ మేలిబంగరుపసి
డోలికఘటించి-జాళువాముత్యాలజాలరుఘటించి-నీలవర్ణుండవనాదసన్నను
నుంచి లాలించియూతురవెలలనలునుమించి॥జోజో॥ జలకములుబోసిరాలక
లునీర్చినుమటం-తిలకమమరంగంబెట్టి తెలిగలువ రేట- జలుకుమననుకుసేమాల
గలప్రభలుమీటంజెలులు పాటలంబాడంజోలిచ్చొటు॥జోజో॥ముంగురులుదువ్వి
రంగుగఝుంముంబుట్టి-రంగుబంగరురావిరేకనడెంగట్టి-శృంగారినుగముద్దుపెట్టు
గరమునంబెట్టిఅంగనలునిదురబుచ్చెదరుజోకొట్టి॥జోజో॥సూరిమిగభద్రప్రత
పురవిహార-తీరుగాగౌతమీతీరమునని- ధారుణీసుతంగూడికోరికలుదీరాం-దారి
నిదురించుమీ శ్రీరామధీరా॥జోజో॥ప్రేమమీరంగతూమునారసింహదాసితో పేము
రునాటపాటలమరిగితేంతో- నేమమునవాఁడునిన్నేమరిగెనెంతో_ కోమలాంగా
రనిదురించుజానకితో॥జోజో॥లాలిపాట॥లాలి శ్రీభద్రాచలేశజయలాలి॥లాలి శ్రీ
నిజభక్తవాసజయలాలి॥రంగైనపరత్న।మంటపంబునసూ।బంగారుతొట్లలో
బాగుమీరగనూ।శృంగారముగసీతసేవింపుచుండా।పొంగుచునునిదురపో అంగ
నలుపాడా॥లాలి॥ పటుతరంబుగమెరయుభాసురకిరీటా।వాటముగకస్తూరితిల
కంబునుదుటా।చాటుమాటునులేకసరిసముగనిచటా। నీటుగానిదురపోవ నాక
న్నులేదటా॥లాలి॥ సొగసైనమొలకనవ్వులముద్దుగులుకా।సోగకన్నులవాలికె
చూపులనుగులుకా।బాగుగనుసీచిన్నిపలుకుసుధలొలుకా।వేగమునసిదురబోర
ఘుకులాతిలకా॥లాలి॥సద్దంపుచెక్కిళ్లనీటుమెరయగనూ।సద్దుసేయకకొల్వు
ద్దనేనివుతూ। పొద్దుచాలగబోయెముద్దులారామ। నిద్దురబోవేయికనుసీరద
శ్యామా॥లాలి॥వరభద్రగిరివరదరామదాసునికీ। వరములొసగుటకునై వేంచే
నెసేమా।వసియించివానింటవరసీతతోడా॥వనజబాంధవవంశనిదురబోయిక
నూ॥లాలి॥నీరాజనహారతి॥హారతి శ్రీశశిశోభితాననాస్మై। జయహరిస్తోత్రలో
క్యపరమపావనాస్మై।కుంకుమపంకిలవక్షోంకాస్మై।కరకంకణకేయూరాదిపరి
రాస్మై।చారుహీరతరాంచితహారాస్మై।శ్రీమన్నారాయణాపక్షివిహారాస్మై
హారతి॥ హాటకాంబరభూషణాలంకృతాస్మై।వతకోటిభానుతేజనిభకిరీటా
స్మై। నారదాదిమౌనిబృందవందితాస్మై। దివ్యవరచింతచరితాసందితాస్మై।
భాసురశ్రీభద్రగిరినివాసాస్మై।రామదాసపోషకావిహారాస్మై॥హా॥ చూర్ణిక॥

నిస్తులవజ్రోపలస్థగితశాతకుంభకుడ్యవేదికాకవాటార్గళవాతాయనే। మ
రకతమణినిబిడతోరణమాలికాలంకృతద్వారభుజగే।నిరంతరమంగళాచారక
లితసాధ్వీజనసంసిక్తగంధసారకస్తూరికాకాశ్మీరజన్మకర్దమవినివారితనిజసం
వర్ణనాగతనానాదేశపరివృఢభూషణసంఘట్టనరజఃపుంజపింజరీ తరంగవల్లీ

మతల్లి విలాసభాసురే। నిబిడాంధకారపరివృంచరణామూల్యరత్నదీపికాడంబ రవిడంబమానదర్పణాబింబితచతుర్దిగ్రాజసదనాతరాళే। సుప్రతీపాదార్యక థాలేఖనవిచిత్రతరబహువిధపటుతెరపటవితానమనోహరే। శ్రీసౌజ్ఞశిఖరహ రివాలుకాబీజచంద్రరజస్సుమనా మేయఫలక్రముకశకలతాంబూలవల్లీచంద నసంయుక్తసముద్గకా మోదబలసంపూర్ణకనకాలుకే। భర్మనిర్మితడోలికా కలితమరాళశాల్మలీతూలానల్పతల్పశిరోచరణ పార్శ్వదేశోపధానమానిత సూనమల్లికాతల్పితమ్రు మపర్యంకే। వైదేహ్యాసహశయానం। పతంగపుంగవ యానసంసేవీననాగవల్లీతూదళుంపముక్తాచూర్ణతాంబూలఖాదితం।దళితది తిసుతం।పయోమండశితశరర్కరతోయక్షీరాభ్యవహారం।శుశ్యాంతవిహారం।సీ తాసీమంతినిసత్కృతసత్కృతసీరాజరాద్యుపచారం। లక్ష్మీనృసింహరామదాసహృ న్మందిరవిహారం।సకలజగద్భరణజాగరూకనిద్రాముద్రాధిరామం॥ శ్రీరామమ హంవందే॥ ఎరుకులకాంభోదిరాగము - అటతాళము.

నిద్దురబుచ్చవేరామునిమంచిసుద్దులుచెప్పవేభామిని॥ ప్రొద్దుచాలంబో మె రమవలదికనొద్దికతోచేరిముద్దియరోసేడు॥ని॥ కనకంపుతొట్లలోనను సొంపుమీ రంగవినయంపుమాటలమనసురంజిలంజేసి॥ని॥ కెందమ్మిసుమముల చందముగేరు మోముందముగలవానిసుందరీమణినీవు॥ని॥ శ్రీకరముగనరసింహునిరక్షించుపా కారివినుతుసీభద్రాద్రీశుని॥నిద్దు॥ ముఖారిరాగము - ఏకతాళము.

నిదురబోనీయవెరాముని।సీతమ్మనీవు।నిదురబోనీయవెరాముని॥ నిదురబోనీ యవెరాముని।సుదవతివానిమనసురంజిల్ల॥ని॥ భండనమునబలుదండిదానవులను ఖండించిబడలెవేదండయానయిక॥ని॥ పక్కనుజేరివానిచెక్కిలినొక్కుచు।చక్క గమరుకేళిఁజొక్కించకనునిక॥ని॥ పొంపుగభద్రాద్రియందు వెలయురఘు।నంద ననిసేవనందిసేయుచువేగ॥ని॥ కులుకుగుబ్బలతళుకుఁజూపకె।అలుకఁజేయకే అళినిభవేణి॥ని॥ నేరుపుతోతూమునారసింహునివెంటజేరితిరిగినిదురజాలకయు న్నాడు॥ని॥ కళ్యాణిరాగము - అటతాళము.

ఉయ్యాలోజంపాలో।మాయొప్పులకుప్పనికి॥ఉయ్యాలో॥ కరికియ్యాలించి నగోపాలునకు॥ఉ॥ఒడ్డారించినదొడ్డదనుజులజడ్డలుడెపిమాకడ్డమ్మబొడ్డునవొ కర్రువుడైతలలున్నబిడ్డనుకన్నపిడ్డనికి॥ఉ॥ ఆలమునదనుజులదునిమిదైహీలవిన్న పమాలకించి।నైదంపకోలలమరినచాలునిగన్నచాలునికి॥ఉ॥ఆపన్నులకెల్లప్రా పై। శోభనాద్రిపైవరసింహరూపమయిపాపముల్లెల్లఁబావదగునీరుపాపనిగ న్నపాపనికి॥ఉ॥ మ॥ శ్రమముడుగన్వసించిఘనసారయుతంబగుచందనంబుదే। హమునసలందిపీడియములందిముదంబెదనొంది జానకీ।రమణినిగూడిరాఘవుఁడు

రమ్యావిలాసవికాసవైఖరిగ। సుమశరకేళిఁ జేలికయై సొంపుగ నిద్దురఁ జెందనిమ్మే-
యిగ॥  శంకరాభరణము - ఏకతాళము.

సందడి సేయవలదు రాకురే। సుందరులారా॥ సందడి॥ సందడి సేయవలదు శ్రీరఘునందనుడు నేడు-సీతామందయానతోఁ గూడి పొందుగ సలుపుచున్నవేళ॥ సం॥ యిందువదనలార మీరు। సుందరముగ నుపాటలుండి పాడనేల శ్రీగోవిందుడు నిదురించు వేళ॥ సం॥ వేణువీణానాదమిప్పుడు వలదులారా సేయవలదు- జానకిఁ గూడి రామచంద్రుడు- చెలియతో శయనించెను॥ సం॥ నీరజాక్షుకునిఁ జేరినా నృసింహదాసుఁ డిప్పుడు ధీయుఁడై పదములో త్రుపదుగో కీర్తన సేయు వేళ॥ సం॥

శ్లో॥ కళ్యాణాకరయోయుయూపవిభవా। కల్పద్రుమా శ్రీప్రదా। కంజాక్షౌకసకోపమాంబరధరౌ కంజాననౌ కామినౌ। కళ్యాణభ్రమరభ్రమాకవిశితౌ। కస్తూరికాచర్చితౌ। దాంపత్యసుఖసంపదేషు భవతాం శ్రీజానకీరాఘవౌ॥

శ్లో॥ సత్యార్థ్యాసరసౌ సదార్చితపదౌ సన్మార్గసంచారిణౌ। సద్వేదాగనకాదిసన్నుతకథౌ సాధుప్రియౌ సద్గుణౌ। సర్వజ్ఞౌ సకలప్రపంచజనకౌ సాకేతసంతోషిణౌ। దాంపత్యసుఖసంపదేషు భవతాం శ్రీజానకీరాఘవౌ। శ్లో॥ రాజంతౌ రపంచబాణసదృశౌ రాకేందుబింబాననౌ। రమ్యభూషియుగళౌ రథోత్సవహితౌ రంభాదినాట్యప్రియౌ। రత్నాంచక్రమణిమ్యకంకణధరౌ రాజాధిరాజార్చితౌ। దాంపత్యసుఖసంపదేషు భవతాం శ్రీజానకీరాఘవౌ। శ్లో॥ నిత్యానందమయౌ నిసర్గసుభగౌ నీలాలకౌ నిర్మలౌ। నిశ్శేషాఖిలామరస్తుతపదౌ నిర్వాణలక్ష్మీప్రదౌ। నీరజోద్భవవందితౌ నిధిరమౌ నిస్సీమనిత్యోత్సవౌ। దాంపత్యసుఖసంపదేషు భవతాం శ్రీజానకీరాఘవౌ। శ్లో॥ గంభీరౌ గజరాజమందగమనౌ గాంగేయహారోత్తమాలంకృతౌ। గంగాసింధుపవిత్రచిత్రచరితౌ గంధర్వగానప్రియౌ। గాధిశ్రీసుతగౌతమాదివినుతౌ గంగాధరప్రస్తుతౌ। దాంపత్యసుఖసంపదేషు భవతాం శ్రీజానకీరాఘవౌ॥ శ్లో॥ ధర్మిష్ఠౌ ధరణీధరాధరసుతౌ ధేనుప్రియౌ ధీమతౌ। ధీరాధీవరపూజితౌ ధిమిధిమిధ్వానప్రియౌ ధర్మిణౌ। ధన్యాధికృతదానపోషసహితౌ త్యాగౌధరాసంభవౌ। దాంపత్యసుఖసంపదేషు భవతాం శ్రీజానకీరాఘవౌ॥

మోహనరాగము - చాపుతాళము.

మెచ్చరికైయుండుడీ దిక్పతులారా- మెచ్చరికైయుండుఁడీ॥ మెచ్చరికై యుండు డెలమి రాముఁడు నే-డిచ్చట సీతతోనింపొంద శయనించె॥ మె॥ పూలపాన్పుపైని పుండరీకాక్షుఁడు-వాలాయముగ నేడు వసియించియున్నాఁడు॥ మె॥ భక్తాజనులుగూడి పదములు పాడఁగ బంకజనాభుడు పవళించియున్నాఁడు॥ మె॥ కూరిమితో తూము నారసింహుని మదిఁ జేరినాడుడు శేషశయనుఁడైయున్నాఁడు॥

శా॥ స్థిరమతితోడఁ దూమునరసింహుఁ డొనర్చు ప్రసేవకుక్ ముదం। బురుసుఖ
ముఁ బడిక న్నాగి చెఘూసుత తోడ రఘూద్వహుండ హో। హరిశుచిధర్మకోణ జప
లాధిప హనుమత్ యుక్త నాయకే। శ్వరుఁ కరంబుజాగ్ర తస హవాన సాయుధుఁడై
చరించుఁడీ॥

మధ్యమావతి రాగము - అట తాళము.

సెల వా నొసఁగు సెలవా॥ సెలవా మాకిక జలజసంభవనుత జలదాభ గాత్ర సజ్జ
నముని స్తోత్ర॥ సె॥ సుందర పద నా సుందర లోల - నందనందన గోవింద సదానంద॥ సె
వనజాక్ష నేత్ర - పావన నామ రిపు భయ - కనకచేల వరద వైకుంఠపుర వాస॥ సె॥ బు
ధజన వందిత - పూజిత పద యుగ్మ మధుసూదనానంద మందరాచల ధర॥ సె॥ ము
గ్ధ లంక భక్త నిర్మల లోల - ధర్మ సేవిత రామదాస విలాస॥ సె॥ నగ రాజోద్భ
వసుత - నగ వైరి సన్నుత - నిగమ సేవిత భక్తనరసింహ పూజిత॥ సెలవా మాకు॥

పరాళి రాగము - చాపు తాళము.

పో॥ లేము యుండ్లకు బ్రొద్దున లేచి రారే రామునికొల్వుకు॥ పో॥ రేప్రొద్దువారిం
బాలకులార రఘుపతి నికథ లెల్ల వినరె ప్రొద్దున లేచి॥ పో॥ పదునాల్గు భువనములు
పరిపాలన చేసి - నిదుర లేక బడలి నిద్రించియున్నాఁడు॥ పో॥ సుందరకారుఁడు సు
స్తిఁ జెందినాఁడు - నందడి గూడ దమ్మయింపు వదనలార॥ పో॥ నీలవర్ణుఁడు మల్లెపూల
పానుపు మీద - పాలుమాలిక చేతఁ బవళించియున్నాఁడు॥ పో॥ భక్తావరులు గూడి
పదములు పాడఁగఁ బంకజనాభుఁడు పవళించియున్నాఁడు॥ పో॥ అంతర్యామి మన
మోహ భ్రాంతిఁ జెందిన సీతా - కాంతను గూడి యేకాంత మందున్నాఁడు॥ పో॥ కోరి
కలర దూము నారసింహుని యింట - జేరి రాముఁడు శేషశయనుఁడై యున్నాఁడు॥
పో॥ వ॥ అని యివ్విధంబున బలుకుచు నిద్రించి యేకువ జామున మేల్కొంచి యిట్లను
చున్నారు॥

మేలుకొలుపు - భూపాళ రాగము.

మేలుకో సుగుణాలవాల - జానకీలోల భక్తపాల మేలుకో॥ వాలాయము గన
న్న పాలించు వేళాయె - వైకుంఠ వాసుఁడ మేలుకో॥ మే॥ భేరీమృదంగాది భీషణర
వములు - ఘోరుగ లుఁగ సాగె మేలుకో - తీరైన కస్తూరి తిలకము జారెను దీర్చి దిద్దవలె
మేలుకో॥ మే॥ తారలు తెల్లనై తెల్లవారెను దేవా రిజాక్షుయిక మేలుకో - తీరైన ము
త్యాల హారము వలె దీప తేజము గాన్పడె మేలుకో॥ మే॥ తూరుపున నుమంచి తీరుగ
రవికాంతి జెలఁగించ సాగె మేలుకో - కారుణ్య సాగర కమనీయ్య కటిసూత్ర హార
మకుటధర మేలుకో॥ మే॥ భరతుఁడు మీ పాదభక్తుఁడు శ్రీమించు పాదుకలను దెచ్చె
మేలుకో - వరదుఁడ నైనీవు ధరణిజఁ గూడె యీధర నేలుదువు గాని మేలుకో॥ మే॥
స్థిరముగ భద్రాద్రిపురమున వెలసిన శ్రీరఘునాయక మేలుకో - తూము నరసింహ
దాసుని యరలేక రక్షించు పరమపావన నీవు మేలుకో॥ మేలుకో సుగుణాల॥

గౌరిపాత్రమునైయున్నానురా - పద్మమిత్రవంశోద్భవగాత్ర శ్రీరఘువంశ పవిత్రా లేరా॥లేర॥ వెల్లిబోసుఁగువచ్చి వాకిటనున్నదినల్లనినా స్వామిలేరా - కల్లగా భుజగమెల్లయే లెడిరఘువల్లభ యిక నిద్రలేరా॥లేర॥ అభ్యంగనమునీకుసమరంగ జేసెదను సమయమైనవేళాయె లేరా - సభ్యులందరు గూడి సాష్టాంగ మొనరించి సంశయములు మానుస్వ లేరా॥లేర॥ పరమభక్తులు నిన్ను ప్రార్థించుచున్నారు పన్నగాధి పతల్పలేరా - వరభద్రాచలమున శరణాగతత్రాణ బిరుదుఁబూనిన తండ్రి లేరా లేర॥ నిరతము సంసారభరముఁ బాపెడి భక్త వరద సీతారామ లేరా - తూమునర సింహదాసుని వెరవకుమని వెంటఁ దిరుగువేళాయను లేరా॥లేర నాపాలి శ్రీ॥

---

# శ్రీ

శుక్రవారము సేవా ప్రకరణము.

---

వ॥ ఈప్రకారంబునఁ బ్రార్థించుసమయంబునఁ గోవాలకవాటంబులు తెరవంబడిన గాంచి స్వామిసన్నిధిని నిలువంబడి ప్రార్థించుచున్నారు॥

భైరవిరాగము - అటతాళము.

అపరాధినపరాధిని॥ రామయ్య॥ అపరాధినపరాధినపరాధినో రామ నేర ములెంచక బ్రోచు నేరదాతవీవె॥ అ॥ దినమెనిమిదిజాములనొకటిగడవైనమన మునిలిపినిను మహామునిపరిరంభించి - ఘనులసంగతిఁగూడి కాలముఁగడుపక - కనుమదమునను మునుగననైతిని కటా॥అ॥ అరిషడ్వర్గముల చేనలసటఁజెందుచు - దురితములకులోగి దుఃఖమందుచును పరమభక్తులఁజూచి పరియాచకముఁజేసి అరసి సద్గురుమార్గమెరుగనైతి॥అ॥ వాసిగ భద్రాద్రివాసునిదాసాను - దాసుఁడనఁగ భువి భాసిల్లినేను - ఆసచే నరసింహదాసుఁడనైభవ - పాశము లెడజిమ్మితోసిలోఁగితిని అపరాధినపరాధిని॥

ఆనందభైరవిరాగము - చాపుతాళము.

నిద్రాముద్రాంకితమైన కన్నులనీటు జూడగ రైను॥ భద్రాద్రినిలయ నాపాలి దైవమ రామభద్ర సీతామనోపద్మభృంగ నీదు॥ని॥ తళుకుముంగురులతో దిలకము మెరయగ - కలికి చూపులు గుల్కగా వలనొప్ప గాచంద్రవదనమందున నవ్వు మొలకలొత్తగ - ముద్దుమురియుచుండెడు నీదు॥ని॥ మదననిర్మల మహిమ దీపించునీ - మంచి కన్బొమలతీరు - సదమలమైననీచక్కని చెక్కిళ్లు మెదలు మేఘము బోలు మృదుగాత్రమున నీదు॥ని॥ వర హేమమకుట పాపనకుండలంబులు వైజయంతికమాలలు - కళుకు బంగరు చేలకాంతులు దీపింప - నరసింహదాసుఁడేమరక సేవించు నీ॥

ని॥ దాము॥ దంతధావనము వధారయ - ద్విజావంతీ రాగము - చాపుతాళము

దంతధావనము దయగా కవధరింపు దశరథనృపనందనా-దంతిరక్షకా దాసపో
షక దనుజాంతక శృంగారవంత॥ శ్రీరామ॥ దంత॥ ప్రాతఃకాలముదయించె పుణ్యాత్ము
రుషులు సంతోషముతోడ నేడు శేషశయన నీవిశేషము జూడఁగ తోషరహితమని
భాషింపుచున్నారు॥ దంత॥ అజభవాసురులు ననఘులసన్మునివరులు నఖిలదిక్పాలు
రెల్ల భజనఁ జేసి కృపఁబడయు కోరికతోడ గజిబిజిగా నిన్ను గాచియున్నారు దే॥
దంత॥ వాసిగ భద్రాద్రివాసా శ్రీనరసింహదాసపోషక రాఘవా లాలసించియు
న్నాఁడ-అనఘా నీదర్శనలేశను చేఁబడ వాసనలణగు ననిశము॥ దంత॥

అభ్యంజనము వధారయ హరే. ఘూర్జరి రాగము - ఆదితాళము.

శ్రీరామ జయరామా సీతామనోరామ- కారుణ్యగుణధామ కౌసల్యా
రామా॥ నీలాంబర శ్యామ-నిత్యశోభనరామా-ఫాలలోచన కామ-భద్రాద్రిధా
మ॥ శ్రీ॥ సంపెంగ తైలమును సరసిరోజముల నలిపి-యింపుగ చందనపు నలుగిడఁ తు
లిడి మెదరు॥ శ్రీ॥ పన్నీటిజలములను-బాగుగ మజ్జనమాడి-సన్నపుపల్వలు దాల్చు
సమయమిదియె॥ శ్రీ॥ నవతులసీమాలిక-యనవ్యశృంగారముగఁ దాల్చి-కవగోని
వకేయూరశాంతిగైకొను నీవేళ॥ శ్రీ॥ మాయామానుషవేష-మునిజనవసితోషా-
మాయాదానవశోష మంజులభాషా॥ శ్రీ॥ కుటిలాకుంతలఫాల-కోటిమన్మథలీల
చటులా కస్తురిఫాల-సామగానలోల॥ శ్రీ॥ సరయూతీరవిహారా-సాధుజనావన
ధీరా-గురుతర మౌక్తికహార-కోమలాకారా॥ శ్రీ॥ సురుచిర కాంచనచేలా-సత
సింహాసనశీలా-వరదాశరథ్య విశాలభక్తానుకూల॥ శ్రీరామజయ॥

అఠాణరాగము - ఆదితాళము.

చూడఁగలైను రాముని సుందరరూపము- వేడుకలర శ్రీభద్రాద్రివిభుని రాఘ
వప్రభుని నేడు॥ చూడ॥ కరుకుబంగారు మకుటము- మెరయు కస్తూరితిలకము-సర
సమైన బొమలు కరుణ-గురియు కన్దోయి గలుగువానిని॥ చూడ॥ ఇందువదనమందు
మందహాసము మెరయఁగ-నందమైన వెడదయురమునందు- ముత్యపుసరులుగల
వాని॥ చూడ॥ నీలనీరద దేహము- మేలిపసిఁడి చేలము-చాలభక్తజనులఁ బ్రోవ-జా
లుపదములుగలుగు స్వామిని॥ చూడ॥ రత్నమంటపమందు- సీతారమణివామాం
కమందు-యెంతో యత్నముగా మెరయ- మమ్మేలు యినకులాంబుధిసోముని రా
ముని॥ చూడ॥ ఇరుగడల జామరములిడఁగ-వరుస ముత్యాలగొడుగులడర-నరసిం
హదాసుఁడెదుటఁ జేయు నాట్యమవధరించు స్వామిని॥ చూడ॥ సీ॥ భరతాదిసోద
రుల్ ప్రణతులై యటనిల్చి కనుసన్నఁ బనిచిన పనులొనర్ప। ప్రేమమీర వసిష్ఠవామ
దేవాదులు మొనసి యాశీర్వాదములు ఘటింప। స్వామి పరాకు హెచ్చరిక హె
చ్చరికంచు సారెకుంచుకులు హెచ్చరికఁ దెల్ప। మంత్రులాశ్రితులు సామంతాదు

తెడనెడనేలమిన్ చొంగడంగ గొంచుకనేయ। గుములుగొనమన్నెదొరలాడి
గముఖసల్ప। హేమసింహాసనంబునైన నధిష్ఠించి। యుదయగిరినల్పుప్రొద్దుతో
నుద్దియగుచు। బెద్దకొలువుండెదశరథుపెద్దకొడుకు॥ శ్లో॥ ప్రాతస్స్మరామిరఘు
నాథముఖారవిందం। మందస్మితంమధురభాషివిశాలఫాలం। కర్ణావలంబిచల
కుండలగండభాగం కర్ణాంతదీర్ఘనయనంనయనాభిరామం॥ శ్లో॥ ప్రాతర్భజా
మిరఘునాథకరారవిందం।రక్షోగణాయభయదంవరదంనిజేభ్యః। యద్రాజ
సంసదివిభజ్యమహేశచాపం।సీతాకరగ్రహణమంగళమాపసద్యః॥ శ్లో॥ ప్రా
తర్నమామిరఘునాథపదారవిందం। పద్మాంకుశాదిశుభరేఖిసుఖావహంమే।
యోగీంద్రమానసమధువ్రతసేవ్యమానం। శాపాపహంసపదిగౌతమధర్మప
త్న్యాః॥ శ్లో॥ ప్రాతర్వదామివచసారఘునాథనామ వాగ్దోషహారిసకలంకలుష
న్నిహత్యంయత్పార్వతీస్వపతినాసహభోక్తుకామా।ప్రీత్యాసహస్రహరినామ
సమంజజాప॥ శ్లో॥ ప్రాతశ్శ్రయేశ్రుతినుతాంరఘునాథమూర్తిం। నీలాంబుజో
త్పలసితేతరరత్ననీలాం।ఆముక్తమౌక్తికవిశేషవిభూషణాఢ్యాం। ధ్యేయాంస
మస్తమునిభిర్జనమృత్యుహంత్రీమ్॥ శ్లో॥ యశ్లోకపంచకమిదంనియతంపఠేతనిత్యం
ప్రభాతసమయేపురుషఃప్రబుద్ధః। శ్రీరామకింకరజనేషుసఏవముఖ్యోభూత్వా
ప్రయాతిహరిలోకమనన్యలభ్యం॥ చూర్ణిక॥ శ్రీమజ్జయవిజయవైనతేయాంజ
నేయనిలయీకృతమహాసుఖమంటపాభ్యంతరసమాసీనసమయారవింద భవ
కందర్పరిపుసంక్రందనబృందారకసందోహానలవివస్వత్సుతకర్బురవరుణమరు
ద్రాజరాజరాజమౌళిస్వమ్యగ్వందనాయమాన-పదరాజీవా- రాజీవశరశత
కోటిజగన్మోహనావతారా తారాధిపనిభాస్యోపరికురువిందముక్తావళిసంవళి
తలసమష్టిషణే- వృష్ణేషుచయవిలుంఠితబాహుబలసుబాహుతపనియ్యవాతా
యునైతేయ త్రిశిరఖరదూషణమహాకాయాతికాయ దేవాంతకనరాంతకవి
ద్యుజిహ్వాగ్నివర్ణవిరూపాక్షధూమ్రాక్షమకరాక్షశక్రజిత్కుంభకర్ణదశ
కంఠప్రభృతినిశాచరకంఠా-కంఠసౌందర్యతృణీకృతశంఖా శంఖకాహళముర
ళీనిపంచికాపంచమస్వరాంచితానూనగానానవద్యపంచ మహావాద్యరసప్ర
మోదహృదయజలజాతా-జాతరూపమయప్రభాభాసమాననేత్రా-నేత్రద్వ
యకరుణావలోకనామృతధారావర్షప్రహర్షితభక్తలోకా-లోకాలోక
పర్యంతభూషితకుందమందారహారిచందనహారిసైంధవశరదిందుసితారవింధ
శేషభాషా-శీవిషభూషకాశపతీకాశకీర్తిభాసామాభ్యాసమానతారకమంత్ర
పఠనవిబుధమస్కరమానసమానసరాజితరాజమరాళా - మరాళాధ్వసం
భూతదేశనాభిమహోత్పలా- ఉత్పలదళవ్యాకోచాతసీగుచ్ఛస్వచ్ఛబలభిదుప

లసజ్జలజలద శ్యామవివర్ణ నిత్యచిత్రవర్ణశోభామనపికాచ్ఛ తాళిదళ ఘటీఘటి
త-స్ఫుటవ్యజనామలధవళాతపత్రసుందరతరరంజితదండ బ్రజగామ నిరపుండరీక
బంధుమండలసంపూర్ణపూర్ణిమాశశాంక- సుదర్శనపాంచజన్యాద్యనేక
ర్వభూమశుభలాంఛనవిరాజమానా- మాననీయ్యాజనతాశయధృతకరదీపికా
ప్రతిఫలితవివిధమాణిక్యకనత్కుండలయుక్తాండవక్త్రగండద్వయదర్పణా- మం
డనాయితతారకాఘనసారానర్ఘ్యనవరత్ననీరాజనాభిరామా- భద్రాచల
రఘురామా - లక్ష్మీనృసింహరామదాసహృత్కమలకర్ణికాధామధామాప
హసితాయుతాయుతతిగ్మధామా నమస్తే॥

ఎరుకులకాంభోజిరాగము - ఆదితాళము.

పదరే సఖియలార మీరు-పదరే మా రాము ॥ సదయుడౌ రామునిపై పూల
చెండ్లు వేతాము॥పద॥ వెలది రామునిపైని బంతివేయు వేళను- చిరుకాలు కలకలము
నీ చెలియ గూర్చేను॥పద॥ భామామణి పైని బంతి రాముడేయగ- కోమలికి సుమతె
ల్లగూయ సాగేను॥పద॥ తాటంకములు కదల తామరసాక్షీ-నీటుగ రామునిబం
తులాటాడుజూతాము॥పద॥ముత్యాలసరము లల్లాడ-ముదిత రాముడు నిత్యానంద
మొప్పా-ఆడు నేప్రజూతాము॥పద॥ మీరీ భద్రాద్రిని తూము నారసింహసి- జే
రి ప్రోచు సీతాహృద్విహారుని జూడ॥పద॥ విరిబంతులాటలాడుట॥గీ॥ దంతిపురము
దు శ్రీకాంతతోడ। బంతులాడెడు వేడ్క-శ్రీమంతుడగుచు। కొలువు దీర్చెను జను
లారకోర్కెదీర।గాంచుడీభక్తిమదిలో సగడలుకొనగా॥క॥ కొందరు హరి చేస
నిలువుడి।కొందరు శ్రీరమణదిక్కు-చూడుండుడీ।గోవిందు డురమయాడెడి। సుం
దరముగు క్రీడమిగుల జూడుడు వేడ్కనూ॥ కాపిరాగము - అటతాళము.

విరిబంతులాటలు చూడరే-మన వెలది సీతాపతిని వేడరే_ సరసంపు మోముపై స
చిరునగవొప్పగ-కరకంకణంబులు ఘల్లని మ్రోయగ॥విరి॥ కలికిచూపుల నీటుగ
గనెంతో-గనుసయిగలను నీటు చిలుక-గ-అలికుంతలములు మోమందు గనిని
డ_చిలుకాలకొలికియా సీతారాము లాడెడి॥విరి॥ వురమందు ముత్యాలసరము లు
యంతో- చిలుకాలపలుకులు మెరయగ వింత- బంతులు కేల బూని శ్రీకరమైనన
వ్వులకాంతా రాములాడు॥విరి॥ శృంగారరసములు గులుకగా నెంతో- అంగనలి
రుదెసబోడగ- బంగారురవముద్దుటుంగరములు వేలరంగుగ మెరయ సీతారా
ములాడెడి॥విరి॥ కందర్పజనకుడు సీతాయాడు కందుకక్రీడాసిఫుణత- పొందుగ
భద్రాద్రియందున గాకమరెందు గలదు నోయిందువదనలార॥విరి॥ తాటంకము
లు ఆసీయాడగ-మంచితళుకు కస్తురిబొట్టు మీరగ-కాటుక కన్నుల కాంతి మెరయ
గ-సీతాకాంతుని మోము తాగనుగొనియాడెడి॥విరి॥ మీరిభద్రాద్రివిహారుడు-

తూము నారసింహదాసు శ్రీమదీయుడు-కోరి శ్రీజగనుబారకనొకటిగ జేసిచిత్తశ్శ్వ
ఱపండ్లాటలాడెడి॥ పి॥ బిలహరి రాగము - అటతాళము.

చెలియతో పూబంతులాడెనే-మన సీతతో పూబంతులాడెనే॥ అలికులవేణీ
యాహల్యశాపమువాపినట్టి-శ్రీరాములుఅతిసేటలతో నేడు॥ చె॥ దొంతిఅజాం
డముబంతిగ జేసి తాపంతగనాడు శ్రీ-విభుడు నేడేటమన॥ చె॥ వేడుకతోడయీరే
డుజగమ్ములుగూడబంతిగబట్టి-యాడు నేర్పరి నేడు॥ చె॥ దనుజులబట్టిశోధన చేసి
పువ్వులు-మనిమినగతిగోటమునమి యాడెడు ప్రౌఢ॥ చె॥ అంగనలైనపువ్పులభంగిం
చిసురలకొసంగి-అమృతపుకలశమందియాడెడు జాడ॥ చె॥ ధరణీనరసింహ
దాసునిదొరయైన-ధరణిజాధిపుడుభద్రాద్రి రాఘువవిభుడు॥ చె॥ మంగళహారతి
జయమంగళం-నిత్య-శుభమంగళం॥ మాతల్లిసీతమ్మకుజయమంగళంనిత్యశు
భమంగళం॥ జయమంగళం భక్తజనులకుశుభమూలు-దయ నేయునట్టి మాతల్లి
సీతమ్మకు॥ జయ॥ అంచెలుపాదారవిందములందు న-పొందుగ మోయనాసుంద
రికన్యకు॥ జయ॥ తళుకుమోమున మించిపలకను మెరయగ- మొలకనవ్వులముద్దు
గులుకు-సీతమ్మకు॥ జయ॥ తాటంకములుతెల్లమాటిమాటికిని- ధాటిపహించుసు
ధాంశుసోదరికిని॥ జయ॥ ప్రేమతో భద్రాద్రి రాముల నేమరక కామించిప్రోచేడు
రామూసి రాణికి॥ జయ॥ వాసిగనరసింహదాసునిహృదయుని-వాసుడౌ శ్రీశ్రీని
వాసూని దేవికి॥ జయ॥ మంగళహారతి॥ మంగళము రాఘుజంగాయపరవల్ల
వాంగనాసురతప్రసంగాయ తేమంగళంభవతుసర్వాంగణాసౌందర్యసంగా
యసతతసిస్సంగాయ తే॥ మంగళం తేనిత్యశుభమంగళం॥ జారాయనవనీతచో
రాయభక్తానుకారాయసులభావతారాయ తే- ధీరాయబుధజనోద్ధారాయ
కైతవకిశోరాయమోహనాకారాయ తే॥ మంగ॥ గోపాలకులరత్నదీపాయదీ
పితకలాపాయమృదుకలాలాపాయ తే-పాపాపనోదనాయాపారసచ్చిత్స్వ
రూపాయవీరప్రతాపాయ తే॥ మంగ॥ నీలాలకాజాలపాలాయపాలితకుచేలా
యతాపసీయ్యచేలాయ తే- బాలాయసుగుణాలవాలాయసుమనోవిశాలాయవే
ణుగోపాలాయ తే॥ మంగ॥ మంగళహారతి॥ అంగజజనక సారంగనయనసీకుమం
గళం॥ జయమంగళం॥ మునిజనములకుజీవనమనదగుపావనమైనమీపాదవనజ
ములకు॥ జయ॥ వనజమునను నొల్లుముఖములపోలుని-కనుగొన్నమీనాభికంజము
నకు॥ జయ॥ అందముగానుయాయిందిరకిరవైనసుందరమైన- వేదండయురము
నకు॥ జయ॥ సొగసైనకస్తూరిచుకరవాసనలీనతొగరేని- డెగడునీనగుమోము
దమ్మికి॥ మంగళంజయమంగళం॥ *

## బాలలీలా ప్రకరణము.

చూర్ణిక.

అథ్య బాలలీలామహోత్సవాభివర్ణనే। కోసలాధీశపుత్రీకృతపూ
ర్వసుకృతఫలపరిపాకభాగ్యసమ్మానరఘు[illegible]తారకీకృతాఖిలజననయ
నానందకందళితసుందరకౌమారికి - [illegible]సౌకల్యబా
ల్యాకి- అంఘ్రిపంకజపరాగ[illegible]సుభగరతా
పసంతాపహారాహల్యాకి-దివ్య[illegible]బంధానుసంధానానందితపంచమహావాద్య
నిఘోషైకి-[illegible]ఫలదీనసరిత్పతిల్యతైలశాల్య
స్నహ్యద్యానపద్మభోజ్య[illegible]సుక్తావశిష్టం[illegible]పవిత్రీకృ
తసమస్తచేతనవిముమణ[illegible]- భద్రగిరివరశిఖరసౌ
ధాంతరవిహారకి-శ్రీరఘుపతికి-లక్ష్మీనృసింహదాసపోషకుడకి-కుందకోరక
రదకి-అస్మాకరక్షక్॥ [illegible]రాగము - చాపుతాళము.

ఎందుకలిగినావు చెల్వరా రఘునందనుని చెందుకలిగినావు చెల్వరా।।ఎందుక
లిగినావు దశరథనందనగోవిందశౌరి।।ఎం।। [illegible]నిన్నుదురస్థ
నివేదుకొంటే।।ఎం।। శరణుజొచ్చినాజననమ్ము-జేకొనిరక్షించవంటే।।ఎం।। పన్న
గాధిపశయనశుభ్ర-సన్నసన్నుతాంమరా।।ఎం।। అంజనీసుతసేవితఘృ-భంజనా
కంజాతలోచన।।ఎం।। కన్నడచేయకనన్ను-కరుణతోగా పాడుమంటే।।ఎం।। మ్రొ
క్కి-మ్రొక్కి-వేడనా-దిక్కు-జూడగనుసీ।। ఎం।। మోముజూపి నేడునాతో-ముచ్చ
టాడుమంటెనీ।।ఎం।। అందమైననీపదార-విందములనుజూపుమంటే।।ఎం।। పంచశ
రశతకోటిసుందర-కాంచనచేలావిశాల।। ఎం।। పంచదారగట్టైద మోమించుక
జూపుమంటే।।ఎం।। కుందకోరకరదనమ్ము-బృందమానసనివాసా।।ఎం।। వాసవస
న్నుతచిద్వి-లాసదాసమనోవికాసా।।ఎం।। అంగజారినతాప్రమేయ-బృంగనిభ
రశుభానుషంగా।।ఎం।। మేరుధీరసమానజగదాధారప్రణవాకారనేడీ।।ఎం।। కేశ
వాచ్యుతాముకుంద-యీశభవపాశాచ్యుతానీ।।ఎం।। కందర్పాభశరీరహృతదశ
కంధరాదరకంధరానీ।।ఎం।। దందశూకవిరోధివాహన- బంధమోచనపాపహ
రనీ।।ఎం।। వారినిధిగంభీరపరమకు-మారకౌస్తుభహారనేడీ।।ఎం।। ఖరముఖాసురభీ
షణాకర-కంఠయువతీభూషణానీ।।ఎం।। మిత్రవంశకులాబ్ధిచంద్రము-మిత్రతన
యాగ్రజానీ।।ఎం।। శంకరప్రముఖాదివందిత-పంకజాక్షజనార్దనానీ।। ఎం।। వారి
జాక్షముకుందవామన-వాసుదేవపరాత్పరానీ।।ఎం।। యెన్నివిధములైననేనీ క
న్నపరులను వేడసుమ్మి।।ఎం।। నారదాదిమునీంద్రపోషా-నారసింహమనోవికాస

ఎందుకనిగిరావు॥ నాదనామక్రియరాగము - చాపుతాళము.

ఎపరేమన్నారురా-రాఘవ-నిన్నెవరేమన్నారురా॥ యెవరేమన్నారుయిన కులతిలక నాచెవులోన దెబ్బ నావలవారిదండంతు॥ యె॥ చాలురతో నాడే- చాల గమలసి రావు-పాలిస్తురమ్మన్న పరిగె త్తిడాగేవు॥ యె॥ పిలిచినబలుకవు-నిలిచిమా టాడవు-అలుకలునే నెరుగవు-ఆర్తశరణ్యా॥ యె॥ యిందురమ్మనికరమందిపట్టిన వెనగి చిందులు ద్రొక్కేరు-వెందుకురాసామి॥ యె॥ ధరణినినరసింహదాసుని వెంటనే- పరాకేయున్నవాడ నచుపోర్వలేక॥ ఎ॥ యమునాకల్యాణి-ఆదితాళము.

రామ యిందాక-రయిందుబోయినావె వోరామ॥ ప్రేమమీరనాముందర నేమరుయుంటైనవా-వపుకావు॥ రా॥ మొలకనవ్వుల మోమునదిలకము మెరయగా- గులుకుచునెముద్దులపలుకులు-నేనువినను॥ రా॥ కుంకుమరసముచుప్పటి-కురుచవి ల్లుచేతబట్టి శంఖచక్రాధారుడవైన-పొంకముగానొగసుమీరిన॥ రా॥ బంగారు చెరగులపీతాంబరు-రంగుమీరగదాలిచియు-ప్పొంగుచుభద్రాచలంబున-సంగతిగ మానీశసుగూడుక॥ రా॥ చందురుగేరు మోమునాశ్రమబిందుకణములూరగా- మందహాసము మెరయగా-మునిబృందమునస్తుతి సేయగా శ్రీ॥ రా॥ శ్రీకరమైన మీపదములు-నరసింహదాసాహ్లాదములు-ప్రాకటముగభవహరములు- శ్రీభద్ర శైలాభరణములు శ్రీ॥ రా॥ శంకరాభరణరాగము - చాపుతాళము.

దారిద్ర్యుడనిమా-సదనమునకురావేమో-తగునాజగన్నాధా॥ ధూయతుం డవీవుభూమిలోనసుపిషమ-బుద్ధిసేకులేదు-పుణ్యాత్ముడవీవు॥ దారి॥ సితదంతిపై నిభా-సితకోటిసూర్యులగతిమించు తేజమున అతులితవిభవములందితిరువీథుల యుం-దున్నతి వెంచేయుగోవిందపరాత్పర॥ దారి॥ కరదీపికలువేయుగరమగ్గితో గాంతి-ఘనతిమిరముభాపగా-సరసతతో దేవసతులునాట్యముసేయ- పురజ నులెల్లభాసురముగగొల్వగ॥ దారి॥ భేరీమృదంగకాహళరములు మ్రోయగజారు వింజామరలు-మీరివైష్ణవులేయమెచ్చిన శ్రీరామ-తారకనరసింహ- దాసపోషక నేడు॥ దారి॥ నాటకురంజిరాగము - చాపుతాళము.

ఏమిరదశరధరామ-నన్నేటికేరక్షించ-విసినీకుప్రేమా॥ యేమిరదశరధరా మా॥ పతితుడననిచెప్పుకొంటి-పతిత-పావనబిరుదుగలదంటి- అతిమోదమున నమ్మియుంటి-నాకుగతినీవేయనినిన్నుబతిమాలుకొంటి॥ ఏమి॥ కరుణరాకున్నది కేరి-వరు- మోహ-పరవశుడనునన్ను బరులుచేకొనరు-గురిచెప్పువా రెవరులే రు-నీవె-దిక్కుగాకధరలో నెవ్వరుగానరారు॥ ఏమి॥ పరులవేడితినా- యేమైనభవ- పరవశమునభక్తవరులదూరితినా-భవపాశమునజెందితిన-భద్ర-గిరివరేశుడని న్నుమరువదలచితిన॥ యేమి॥ ద్రోహియనుచునెంచబోకు- పక్షివాహననీవాడ

బరులకిక్వ్వకు-సాహసమునవిడువబోకు-భవమోహాదులను జెందిమోసపోకు॥ ఏమి॥పరమమంత్రమెజీవనమురా-నీ,చరణసేవమాకుపరమమంత్రమురా- అరలేక నేవఁజేసితిరా- తూము-నరసింహుఁడనటంచు-మురబెట్టితినిరా॥ఏమి॥

నాదనామక్రియరాగము _ ఆదితాళము.

నినునమ్మియున్నవాడను॥ నినునమ్మియున్నవాఁడనీ రేజదళనేత్ర.చనువిచ్చి మాటాడవుసామినానేర మేమి॥ని॥ఘనమయినతాపత్రయము-దినదినముమేచగా నే_వినయముతోడదెల్ప-విననట్లున్నావిదేమి॥ని॥శరణాగతుడనైమిమురుపు జొచ్చిననన్ను-వెరవకుమనిబ్రోచువిధముజూపవిదేమి॥ని॥ నగుమోముజూపి నెడునాతోమాటాడవేమి-పగవాడవానీకుతగునాజాగేలనయయో॥ని॥ మొరగు తెరగదేమనవు-బిరుదుపేదరికమా-నా_ తరమానీదయరాకున్నాదరిజేర నేరనయ్యయో॥ని॥భారమునీదనుచుపరులవేడగబోక- కోరినీప్రాపుదాపుజేరియున్నాఁడసామి॥ని॥గరిమతోడుతతూమునరసింహదాసునకు-గురిగాప్రాపైనాడవనినిన్నరసి సేవించినాడ॥ని॥ రేగుప్తిరాగము - అటతాళము.

రామరామయందునో-అప్పుడువట్టిపామరమనసుందునో॥ కాముకుఁడనటంచు-గాలునిదూతలు-కరుణమాలినన్నుగష్టబెట్టెడువేళ॥రా॥ జపముతెరుగనైతిని-ఎన్నడునిష్టతపముసేయనైతిని-కఫవాతపైత్యాదికర్మములనజెంది-యుపమలేకబుద్ధియూహాదిరుగువేళ॥రా॥తనువుస్థిరముగాదని-బుద్ధినిమున్నెదలచుకొనగనైతిని-ఘనమయినతారకమనువర్ణాక్షరముల- మహిమచేతనుబుద్ధినుమతదొలగిశ్రీ॥రా॥దానమెరుగనైతిని-యెన్నడుయొక్క-ధర్మమెరుగనైతిని- మానాభిమానముల్మచ్చరింపగనాత్మ-గాననుదూతలగనువేళనైనశ్రీ॥రా॥మనసునిల్పనయితిని రాముని సేవ-మరిగియుండనయితిని-మరణకాలమునందు- మమతజెందకసీతా-వరునిధ్యానించుటకు-స్థిరమైనమతిగల్గి॥రా॥శరణుశరణటంచును-శ్రీరాముని-చర్చలెల్లవిందును-ధరలోపలనుతూమునరసింహదాసుని-అరసిప్రోచెడిరఘు-వరునినామదినిల్పి॥రామ॥ శంకరాభరణము - అటతాళము.

రామానీవెందున్నవాడవో-భక్తరాజీరక్షణమదిబూనవో॥పామరజనములుపండితజనములు-తామసజనములుతవిలిబాధింపగ॥రా॥నీసేవనీపూజనీనామస్మరణ-నీపదధ్యాన్నమునిక్క-మటంచు-హాసిభంగముసేయదలచిపిశాచములవలె- నేమకొల్పగజూచిచూడకయున్న - యెక్కడజూతుమెవ్వరుదిక్కు-సీతా॥రా॥పరగుప్రహ్లాదద్రౌపదిదంతివరులు-బలివిభీషణాదిసద్భక్తవరులు_మరియునారదప్రముఖులెల్లను - అరసినీచరణాబ్జములుగని _ తరముగానిభవాబ్ధిదాటుట-దలచినమ్మితిదారిదెలియదు॥రా॥శునకశౌనకాదివాసుకిసనందాది_ష

కట మోహఘనిన్ను బాధించ దిమియంచి- యొకటిబహుసులభమనిభాగవతపురా
ణముఘోష్టి పప్పరి అకట నేనది గాంచి వాంఛను-నాసచేదప్పిగాని చేరితి॥ రా॥ కల
మోహములనుబుట్టించి కర్మములెల్ల కలకాలమును జేసికడముట్టకెల్ల- బలువుగలదుఃఖ
ముల పాలై-బడలినన్నుమకరుణ చేసి నలలితాంఘ్రులుగాంచగోరితి-సామియుం
తప రాకి కేటికి॥ రా॥ పతితులలోఁగడు దుష్టుడనైనను-కరుణచే దాససంగతిగల్గిప
ట్టడసి-భరతముగలసంస్పర్శనిపిడియాతని- శ్రీనరసింహ దాసాఖ్యనిక జనములని
ల్పి-ధన్యతగాంచితి సభద్రాద్రిశ్రీరఘు॥ రా॥ మాంజి రాగము- ఆదితాళము.

రామాసిదయ రాదా-పూర్ణ-కామానీమదిలేదా॥ రామా నవజలదశ్యామా
-జగదభి రామా భద్రాద్రిధామ మమోహరఘు॥ రా॥ మేలనాతో చలమేలకరుణా
ల-వాల దాసపరిపాలా మోహరఘు॥ రా॥ నా దాసికృపలే దాసమయముగా దా-
యని మరి యూ దా మోహరఘు॥ రా॥ ఘోషానవరత-తో నారసింహ-ఘోషామా
నుప వేషా మోహరఘు॥ రా॥ బిలహరి రాగము - చాపు తాళము.

శరణాగతపోష రా-దాసాశ్రిత వరగుణసాగరా॥ దరిసి నేయని వేడ-
దయజూడ రాదా-కరుణతో నేమించగతిసి వెకాదా॥శర॥ పిలిచినబలుకవు-బిరు
దటిగా దా-యులుకలేటి ప్రోవవదినురియాదా॥శర॥ పగవానితమ్ముని బాలింపలే
దా-అనవసచేసినసికెయుపక్తిగా దా॥శర॥ మనవి దెల్పిననూనిమదిజాలిగాదా-
ఘనముగరక్షింపగదవయరాదా॥శర॥ వరభద్రాచలరఘు వరయాదిలేదా-
యనసిర ఏంచుటకదిసి వెకాదా॥శర॥ కరిమొరవినివేగ- గరుణించలేదా-కరుణ
తో నరసింహునిగరుణింపరాదా॥శర॥ బిలహరి రాగము - చాపు తాళము.

కాచి ప్రోచిన మంచి దే- నాచేతను-గాదన్న మరిమంచి దే॥ ఆచిచూచినాడన
రసి నేనిన్నాళ్లు-దాచుకొన్న దొడ్డ-ధనముచందంబున॥ కా॥ బాలుడవీడసి-పా
లబడ్డందుకు-యేలుకొన్ననుఖ్యాతి-చాలాగల్గుగాని॥ కా॥ పతితులబ్రోచెడి-పం
తము నెరి సెను-అతి మోదమునన్నన్ను-ఆదరించినజాలు॥ కాచి॥ నమ్మినవిడనాడ-
న్యాయము తెలిసిన-సమ్మతితోడ-సీతమ్మనైనగోలుతు॥ కాచి॥ కూరిమితో తూ
ము-నారసింహుని బ్రోచు-భారమునీదని-పలుమారు వేడితి॥ కాచి॥

కల్యాణి రాగము - ఆది తాళము.

నాను రామయుంచేసినసొమ్మిక-యేమితక్కువాని॥ కామితార్థఫలదాయ
కనవికులనో ముని-దారక నాముని రాముని॥ రా॥ కూరగాయ మాటలు-వద రెద
న్ను పూటకైన గావు-నోరికొలది శ్రీనారాయణయని-సారెసారెకును చాటిపలు
కుచునుం॥ రా॥ గాని జెంచితిరిగిన-ఫలమించుకఁగాన వైతివికను- వాసిగభద్రగిరీశు
ని దాసుల- దాసునినారసింహదాసునిగనుగొని॥ రా॥

కాంబోధిరాగము - ఆదితాళము.

రాముఁ నమ్మితి-దేహము-స్వామికి నమ్మితి॥ కామకోటిసుందరా-కారుఁడైన శ్రీభద్రాచల॥రా॥ క్షయము లేనిది హానుష్యము గానిది-భయము లేనిది. రోగముల బాధ గానిది-వ్యయము లేనిది భక్తవరులకు వదమిది-గాఢ నియమున నై పావనమౌ నక్షయపాత్ర-నాధారము చేసుక॥రా॥ ముజ్జగంబుల కెల్లను మోహనమైన దివ్యజ్జీవనము సంసార తారకము-లజ్జవీడను భక్తులకు యోగము కాల్లను సజ్జనుల కెల్ల బూరఘునముగ బట్టి స్మరణ చేయుము॥రా॥ భాసురమైన భద్రాద్రి శ్రీశుకకోలుపది మోసము లేనిది భక్తమోక్షప్రదమిది-వాసవాదుల కెల్లను వశ్యమైనది వాని గానునరసింహదాసుడను సేరబరిగి॥ రా॥ బిలహరి రాగము - ఆదితాళము.

భాగవతుల పాదరజము మైని జల్లుకోవలె॥ భాగవతుల సేవ చేసి భాగ్యము నుకోవలె॥ భాగ॥ గంగకృష్ణవేణిలోన గ్రహణకాలమందున- పొంగి స్నానమా-చరించు-పుణ్యమునను మించు యీ॥ భాగ॥ మేటిభూదానములను చేసిన-ఫలము-కోటికన్యాదానఫలము-కోరి గాంచినట్టి యీ॥ భాగ॥ భవసముద్రము దుటకును-భక్తితో నొసగ్చినా-నవనశత మొసంగు ఫలము- సద్బ్రశంసగ బోలు నీ॥ భాగ॥ భద్రగిరినివాసు పాద-పద్మయుగము మనమునా భద్రము నుంచు నమ్మియు స్వపరమముఖ్యులయిన యీ॥ భాగ॥ పలువిధముల ప్రబోధనుటకును ప్రాపు దాపు గానుముక్ - జెలగినారసింహునకును-జీవనముగనున్న యీ॥ భాగవ॥

ఆనందభైరవిరాగము - అటతాళము.

హరి నామ మొరవిని రావదేమి శ్రీహరి నామ మొరవిని రావదేమి॥ భద్రగిరి దూరంబని మరచియున్నావో॥ హరి॥ కరిరాజు నీకు చుట్టమా-వాని- మొరవిని వేగను కరిని ద్రుంపవా॥ హరి॥ దిక్కెవ్వరు గాక మా కెవరు-యింత లరయుచుండిన నైరు-లగనిమిరుదురు॥ హరి॥ వెఱువకుమని పలుక రాదా-తూము-నరసింహదాసపోషక దయ లేదా॥ హరి॥ కల్యాణిరాగము - త్రిపుటతాళము.

పాహి శ్రీరఘునాయకా-భక్తజన-పాలనసనుబాయకా॥ పాహి శ్రీరఘువీర-పరమదయాకర-ప్రతాహిజనోద్ధార-దైత్యవిదారమాం॥ పా॥ వారివాహశరీరా-వనరుహమిత్రవంశ పావనకార-పారావారగభీర- క్షీరాంభోధివిహార. పాలిత పాండవపర మోదార-సూరిజనమందారరణజయ- శూరమార్త్తికపట రవరశుకు-మార శ్రీరఘువీరమంధర-ధీరమౌనిమనోవిహారా॥ పా॥ కందర్పజిత సుందరా-బృందారక-వందితధృతమందరా- చందనాగరులిప్తసజలాభ్రనిభ గాత్రమందస్మితారవిందసదృశనేత్ర- యిందిరాహృన్మందిరాస్మగ-సుందర రోషకకందరాదశ-కంధరాంతకవినుతశ్రీగర-కంధరప్రశితచరణయుగళ॥ పా

వరదా శ్రితపాలనా-శ్రీలక్ష్మీ-నరసింహదాసావన- అరదరశార్ఙనందకగదా యుధ-ధరవరగరుడకేతనలసత్కనకాంబరధర-పురహరప్రముఖాదివందిత-పుండరీకశయాన-శ్రీధర-నిరతిశయగోవిందమాధవ- నిఖిలలోకానందభవహర॥పాహి॥ భైరవి రాగము - ఆదితాళము.

స్వామీనామొరవినకున్నావేమి॥రామస్వామి॥ కామజనకసుత్రామవినుతసుమ-ధామభద్రగిరిధామరామ॥స్వా॥చలమాపిలిచిన(బలుకవుని-శ్చలమా- కలనైనమిమువీడగలమా-అలుకలేలభవ-జలధిలోన నే-నిలుకడ ప్పెనినుబల్కరించితిని॥స్వా॥ఘనమానను బ్రోవవుయిది-దొరతనమా- మునునీకధలెల్లవినమా-చనువుమారి నేవినయముతో డుత-బనివిననీమృదుపదములుగొలిచితి॥స్వా॥ భరమానను బ్రోచుటకును- స్తరమా-అరజేసిననికనాతరమా- సిరులిడశ్రీనరసింహదాసజను-గరుణ బ్రోతువని-కడునమ్మితి॥ రామస్వామి॥వ॥ఇవ్విధంబున కొంతకాలంబుగడచినపిదపవరదరామదాసు గారు పూర్వకృతదోషంబునవ్యాధిగ్రస్తులై గానములందలంచికీర్తింపుచున్నారు॥బిలహరి రాగము- చాపుతాళము.

భద్రాచలనిలయ- మాంపాలయపావనబిరుదేదయ॥ అద్రిజానుతహాటకాంబరధరరుద్రభయహరణకార్ద్రవేయశయన॥భ॥దాసోహమనుటకుదరిదెలియదాయ- వేసముదాల్చినవేసారుటాయ॥ భ॥ కరుగదాయమరికఠినత్వమేమొ-కరుణజూచిననన్నుకాపాడవైతివి॥భ॥వరదరామదాసుడనియనుటాయ-వరములొసగకున్నమరితాళదాయ॥భ॥ సౌరాష్ట్రరాగము- ఆదితాళము.

యేదిరానీదయరాదానాపై-ముదముగదురమృదుపదములునామది- సదయతవేడితిసామజవరద॥యే॥ప్రేమతోజూడరస్వామిపరాకేలర- రామాయనినేవేమరుమొరలిడ-కామితమొసగవెకాంచనచేలా॥యే॥ యేలరయీచలమేలరనాతో-మేలురానన్నేలుటిదేజాలురా-శ్రీసీతాలోలా॥యే॥వాసిగవరదరామదాసావికాస-అసశ్రీనివాసభద్రాదాసమానసాబ్ధితోషా॥యేది॥

అయిరిరాగము - చాపుతాళము.

రామభద్రాద్రిధామా-శరణన్న-యేమరుటిదిమేరా॥ అంతటికినీవేగతియని-నేనాశించితినయా॥మేరా॥రంగుగనీనవరత్నకిరీటమురమ్యముజూపుమంటి-ముదముతోడనీముంగురులిటుజూపిముచ్చటాడుమంటి॥రా॥కరుణతోడనీకస్తురితిలకముకన్నులజూపుమంటి-సురచిరమగునీసోగకన్నులనన్నుజూచిబ్రోవుమంటి॥రా॥పొందగుమకరముబోలుకపోలముసుందరమునుగంటి- అందమయిననీమందహాసమిపుడిందుజూపమంటి॥రా॥ సంతతంబుననుసదయహృదయమునజాలనుంచమంటి-కంతుజనకనీకాంచనచేలముగానుపించుమంటి॥రా॥కరమదు

దుగనీకోదండముజూపికరువుదీర్పుమంటి-కంకణములుగలకరయుగములువాని
గనగోరుచునుంటి॥రా॥అందెలుగజ్జెలుగలమృదుపదములునమరజూపవటే-
మేఘశ్యామలసుందరముగనీమేనుమెలిమిజూపుమంటి॥రా॥ పతితులనేలెడిబిరు
దుగలదనిప్రఖ్యాతిగవింటి- నరుడనుజడుడనుజ్ఞానహీనుడనునన్నేలుమంటి॥
రా॥అతిఆశకుడనిఅరమరసేయకఅరసిబ్రోవుమంటి- జంటబాయకనేనువెంట
నుంటినాయింటనుండుమంటి॥రా॥నీదాసులవలెసేవజేయుటకునేర్పునేరనంటి
ధరణిభద్రగిరివరదరామదాసునీదయనేలుమంటి॥రామ॥

కేదారగౌళ రాగము - చాపుతాళము.

పూజచేతామురారె॥ శ్రీరాముల॥ పూజజేతామురారెపుండరీకాక్షుని-
పదపద్మములకుపన్నీరుపుష్పాల॥పూ॥నవరత్నపళ్లెములనవనవలాడెడు-నవతు
ళశీదళములనయముతోడుతదెచ్చి॥పూజ॥ గొజ్జంగిరేకులుఘనమయినకమల
ములు-కాంతిచామంతులుకడువేడుకతోదెచ్చి॥పూజ॥ మొల్లసుగంధములుకో
ల్లగదెచ్చిన-మల్లెపుష్పాలుమంచిమందారపుష్పములు॥పూజ॥ వరభద్రగిరియం
దువరదరామదాసునిహృదయ-కమలమునవునికిజేసియున్నాడు॥పూజ॥

వ॥ వరదరామదాసుగారుమానసపూజగావించుట.

సీతాసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
అనంతగరుడవిష్వక్సేననానావిధకుసుమాన్యవధారయా.
పరాంకుశపరకాలాద్యిసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
హరసమర్పితమల్లికాకుసుమాన్యవధారయా.
చతుర్ముఖసమర్పితపుండరీకమవధారయా.
అష్టదిక్పాలకసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
యింద్రసమర్పితపారిజాతకుసుమాన్యవధారయా.
సర్వగీర్వాణసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
సూర్యాదినవగ్రహసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
దేవఋషిబ్రహ్మర్షిసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
కృష్ణాకావేరిగౌతమీసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
గంగాయమునాసరస్వతీసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
సాగరసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
శుకసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
ప్రహ్లాదసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
తులసీసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.

శ్రీరామముఖ్యమాతసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
భద్రనగసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
జనకసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
భగవతాదిసోదరసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
నారదసమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
రామదాససమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
నృసింహరామదాససమర్పితనానావిధకుసుమాన్యవధారయా.
వరదరామదాససమర్పితనానావిధకుసుమాన్యవధారయా.

కేదారరాగము - రూపకతాళము.

నారాయణ నారాయణ నారాయణహరె॥ నారాయణఘనమునివినా రాయణశౌరె॥నా॥కరుణాగతశరణాగతభరణామృదుచరణా- అరుణాధర బింబాధర-చరణాభవహరణా॥నారా య॥కస్తూరిమదరేఖాంచన-కటిశోభా మస్త-కనుకుటాంగదమోహనశుభరేఖాం॥ నారా॥ వరభద్రాచలవాసా-వర మృదుగుణభూషా-వరదరామదాసాన్వయభూమాఖిలరూపా॥నారాయణ॥

వ॥ఈప్రకారముస్తుతించుచు నేకాదశీదివసప్రాతఃకాలంబున.

శ్లో॥హరా—వరదరామదాసుడనిశంబునువదలకహరినిదలంచి-
పరమపదముజేరెనుకొన్నాళ్లకుపాంచభౌతికముమరచి॥ఇ॥
అకలంకుండైనృసింహదాసుండానందమునొందుచును-
సకలవాద్యములుమ్రోవగభక్తులుసరసనుభజియింపగను॥ఇ॥

యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

నారాయణ శ్రీమన్నారాయణ ॥ నారాయణాచ్యుత నగధరనారసింహ నామాఅనంతశౌరి॥నారాయణ॥పన్నగశయనసుప్రసన్నదీనులబ్రోవకున్నా- విదేమెశ్రీమన్నారాయణ॥ నారాయ ॥ నిన్నేనమ్మితిననియున్నవాడను-నన్ను మన్నింపవయ్యశ్రీమన్నారాయణ॥నారాయణ॥యెన్నడుపరులవేడకున్నవాడ ననన్ను-కన్నడసేయకయ్యనారాయణ॥ నారాయణ ॥ మారజనకమేరుధీర పావకసంభవ్యాగసుకరశ్రీమన్నారాయణ॥ నారా॥ వేరేనీకన్నదిక్కులేరనిము న్నేనిన్నుజేరితిశ్రీమన్నారాయణ॥నారా॥ కోరికలిచ్చితూమునారసింహునిజేరి కాచిరక్షించుశ్రీమన్నారాయణా॥నారాయణ॥

భైరవిరాగము - ఆదితాళము.

కోదండపాణియదిగో॥ కోదండపాణియదిగో॥ అళిసముదయమును లె- నదలించెదుబల్- తళుకుమంగురుల జెలుగుచుగువాడదిగో ॥ కోదం॥

తోహరా — సకలేంద్రియములనొకటిచేసియాసాకేతపురాధిపుని-
అకలంకమనోపద్మమునందునహర్షముతోనిల్పుకొని॥౨॥
నాదబ్రహ్మముదిశలునిండకర్ణామృతమైపొలయగను-
ఆదిదేవదామోదరయనుచునుహరిపదములుదలచుచును॥౨॥
మోక్షమ్మగోరుచుచేతులెత్తుకొనిమ్రొక్కుచుభజియింపగను-
సాక్షాత్కరించెభక్తులహృదయంబులసకలసురలుపొగడగను॥౨॥
యెదుటనిలచిమీకోరికలన్నియునీడేరెనరమ్మనుచు-
సదయుండైచెప్పుచుశ్రీరాములుచనియెనదృశ్యుండగుచు॥౨॥
అంతటదెప్పనసింగనిటెలోనచటిజనులుచూడగను-
వింతమైనతేజమువెడలెనునక్స్వతలంబునిండగను॥౨॥
ఆదినంబునంబరమధ్యంబుననమరులువేడుకజూడ-
నాదమునిండెవినోదముగానానదినందనుగొనియాడ॥౨॥
యీవిధమునసరసింహదాసుతనయిష్టభక్తులతోగూడి-
శ్రీవైకుంఠముజేరిసుఖించెనుశ్రీపతినసిశము వేడి॥౨॥
యీకథనెవ్వరైననుపఠించినవినినసింపుమీరగను-
చేకూరునుయిహపరసుఖములుశ్రీసీతారాములకృపను॥యి॥
యెంబెరుమానారుకృపకుపాత్రులగువిభుదవరులుమెచ్చగను-
నంబెరుమానారుసూరిరచించెనుసరసములుగులుకగను॥౨॥
విభవమైననరసింహదాసుకథయింపుమీరజగములను-
ప్రబలపరచెనుశింగరిదాసుడుపరమభక్తులకృపనూ॥యి॥

శ్రీ-తూము-నృసింహదాసుచరిత్రము.

సంపూర్ణము.